

"దొంగనోట్లు" చిత్రంలో సరోజాదేవి.

గోకుల్ ప్రొడక్షన్స్...

# శ్రీ తిరుపతమ్మ కథ



దర్శకత్వం:
బి.యస్. నారాయణ

నిర్మాత:
దోనేపూడి కృష్ణమూర్తి

# భారీయెత్తున దేశరక్షణకు
# ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి



'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టునులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

# ఉత్తరాలు

## ము ఖ చి త్రం

శ్రీ జగ్గయ్య (4—10—63 సంచిక ముఖ చిత్రంమీద) వేసుకున్న టోపీ నాకెంతో నచ్చింది. కాని అవి కాశ్మీర్‌లో తప్ప దొరకవని భయంగా ఉంది.

పి. వి. రావు (కాకినాడ)

*　　*　　*

శ్రీ జగ్గయ్యగారి ఫోటో బాగానే ఉంది కాని ఆయన నలుపూ, తెలుపూ కలిసిన టోపీ వేసుకుని ఉంటే బక్షీ గులాం గుర్తుకి వచ్చేవారు.

ఎన్. కమల (విజయవాడ)

*　　*　　*

అకస్మాత్తుగా జగ్గయ్య పత్రికాముఖంగా సాక్షాత్కరించడం మమ్మల్నెంతో ఆశ్చర్యపరచినది. ప్రముఖ, వర్ధమాన నటీనటుల చిత్రములను ముఖ చిత్రాలుగా వేయుట మాకు నచ్చినది.

గుండుమళ్ల రామారావు, బలరామదాసు (శ్రీకాకుళం)

*　　*　　*

27—9—63 ఆంధ్ర సచిత్ర వార పత్రిక అట్టమీద బొమ్మ కుమారి కృష్ణకుమారి వల్ల చీర కట్టుకున్నట్లు ఉంది. 'పునర్జన్మ' సినిమాలో ఆమె ఏ సీనులో ఈ చీర వేసుకున్నారో తెలుపగలరా ?

వి. సుబ్రహ్మణ్యం (కడప)

## క థ లు

''జానకి డైరీ'' కథ చాల నైపుణ్యముగాను, వాస్తవముగాను ఉన్నది.

ఆ కథ చదువుచున్నంతసేపూ ఇంకా ముందు ఏమి జరుగనున్నదో అనే ఆతృతతో పాఠకుల హృదయాన్ని ముందుకు తీసుకపోతున్నది.

ఎ. ఎస్. మోహనదాసు. (శృగవరం)

*　　*　　*

'జానకి డైరీ' అను కథ నన్ను చాల ఆకర్షించినది. 'సీతాపతి' వంటి సహృదయులైన భర్తలు అందరికి కలిగితే ఎంత బాగుండు ననిపిస్తుంది. ఇంతటి రసవత్తరమైన కథను వ్రాసిన రచయితకు నా అభినందనలు తెలుపకుండ ఉండలేకపోతున్నాను.

ఉమారాధ (అనంతపురం)

*　　*　　*

''తీర్థయాత్ర'' కథ నన్నెంతో ఆకర్షించింది. మరాఠీ మూల మైనప్పటికీ శ్రీ చంద్రమౌళిగారి రచన చక్కని శైలిలో నడిచింది. అక్కడక్కడ తెలుగు నేత పరిపూర్ణంగా లేదు. రచయితగారు కొంచెం నైపుణ్యం ఇంకను చూపించిన ఎంతో బాగుండెడిది. మొత్తానికి అనువాదం శ్లాఘనీయంగానే ఉంది. ఇటువంటి ఉత్తమ రచనను ఇతర భాష నుండి అందించిన అనువాదకులకు, ప్రచురించిన మీకు నా ధన్యవాదములు.

షేక్ మహమ్మద్ ముస్తఫా (వెలవలి)

*　　*　　*

''పిచ్చిదానా ఎక్కడికా పరుగు.'' అను కథలో సీతకు రచయిత్రిగారు చాలా అన్యాయం చేశారనుకుంటా. సీత కన్న కలలు నిజంగా గాలి మేడలల్లాగ, సీత జీవితంలో నిలచిపోయాయి. కథ చదువుతుంటే నిజంగా కన్నీళ్లు కారాయంటే నమ్మండి. అంత చక్కని కథను పాఠకలోకానికందించిన రామలక్ష్మిగారికి నా ధన్యవాదాలు.

వడ్లమాని రామసూర్యం (హైదరాబాద్)

*　　*　　*

శ్రీమతి కె. రామలక్ష్మిగారి ''పిచ్చిదానా ! ఎక్కడికా పరుగు'' అన్న కథ నాకు ఎంతో బాగా నచ్చిందండీ . నిజంగా అలాంటి కథని నేను పూర్వమెప్పుడూ చదివి ఉండలేదు.

వై. మురహరి (గుంటూరు)

## నా అనుభవంలోకెల్లా....

నా అనుభవంలోకెల్లా పెద్ద పరిశోధన శీర్షిక అయిపోయినందుకు నాకు విచారంగా ఉందంటే అతిశయోక్తి కాదు. ఒక్కొక్క కథా చదువుతూ ఉంటే ఆ ఆ వూళ్లో పోలీసులతో ఉన్నట్లే ఉంది!

ఎ. రాజనారాయణ (నిజామాబాదు)

*　　*　　*

నా అనుభవంలోకెల్లా పెద్ద పరిశోధన వ్యాసాలు 20 కూడా మాకు ఎంతో నచ్చాయి. వాటిని వేరే ఫైలు చేసుకున్నాం. ఇటువంటి వాస్తవిక డిటెక్టివ్ సాహిత్యం యిక ముందుకూడా వేస్తారని ఆశిస్తున్నాము.

ఎం. మాధవరావ్, జి. రాజారావు (తెనాలి)

## కొ లం బొ

పై సీరియల్ బాగానే ఉంది కాని 'కార్మెన్' వేసి ఉంటే ఇంకా బాగుండేదేమో ?

ఎం. రజని (గుంటూరు)

## న్యూ ఢి ల్లీ లే ఖ

శ్రీ కామరాజనాడార్ సృష్టించినపథకం దేశంలో పెద్ద దుమారమే లేపింది కాని, చివరికి దాని ఫలితాలు ఎలా ఉంటాయో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. నిజంగా మన దేశంలో సమిష్టి నాయకత్వం ఒకటి ఏర్పడుతుందా ? శ్రీ కృష్ణగారి వ్యాఖ్యలలో ఇది స్పష్టంగా సూచించటంలేదు.

ఎస్. వి. సత్యభామ (మద్రాసు)

*　　*　　*

ఈ వారం (4 -10 -63) పత్రికలో శ్రీ కృష్ణగారు కామరాజ్ పథకాన్ని గురించి సమీక్షిస్తూ ''1947 నుంచి అధికారాన్ని అనుభవిస్తున్న వాళ్లను చూస్తూ బాధపడేవారికి శ్రీ నెహ్రూ నిర్ణయం దివ్యౌషధం మాదిరి పనిచేసింది. ఈ విషయాన్ని నిరూపించటానికి డా. జీవరాజ్ మెహతా వృత్తాంతం చాలు'' అని వ్రాసారు. కాని, డాక్టర్ మెహతా కామరాజ్ పథకం క్రింద పదవీచ్యుతులైనవారు కాదు. గుజరాత్ శాసనసభలోని మెజారిటీ కాంగ్రెసు సభ్యులతో, ఒక ముఖ్య విషయమై వచ్చిన అభిప్రాయభేదాలు కారణంగా ఆయన రాజీనామా చేయటం జరిగింది. ఈ విషయాన్ని శ్రీ కృష్ణగారు గమనించవలసినదిగా కోరుతున్నాను. నిజానికి శ్రీ కృష్ణగారు శ్రీ జగజీవన్ రామ్ వృత్తాంతాన్ని ఉదాహరణగా చెప్పిఉండవలసింది. ఎంచేతంటే, ఇంచుమించు గత శతాబ్దన్నర మంచి, నిరాటంకంగా అధికారాన్ని అనుభవిస్తున్న వారిలో ఆయన ఒకరు.

మూర్తి (వాల్తేర్)

## అవీ - ఇవీ - అన్నీ

''పద్మశ్రీ షూటింగు'' లో తమ తాజా చిత్రాన్ని ఈనెల 1వ తేదీనుండి షూటింగు ప్రారంభించారు. ఈనెల 11 నుండి .... జరిపించారు.

''చందమామ ఫిలింస్'' ఈనెల 15 వ తేదీని.... ప్రారంభించారు. అని పై శీర్షికలో అక్టోబరు 4వ తేదీ పత్రికలో వ్రాసినారు. అవి తప్పని తలచుచుంటిని మరల ఇటువంటి తప్పులు ''ఆంధ్రుల అభిమాన ఆంధ్రపత్రిక'' యందు దొరలకుండ చూడ ప్రార్థన

బి. ఎం. ఎస్. నారాయణరావు (గుంటూరు)

## అ ను మా నం

మీ(మా)ఆంధ్ర సచిత్ర వార పత్రికలో, ఇలాంటి అనుమానాన్ని తెలియపర్చడం సబబు కాకపోవచ్చు, అయినా అడగాలనే అనిపిస్తోంది. కనుక అడిగేస్తున్నాను.

గోకుల్ ప్రొడక్షన్స్‌వారు తమ చిత్రానికి 'శ్రీ తిరుపతమ్మ కథ' అని పెట్టారు. స్త్రీలింగ మైనప్పుడు శ్రీమతి అని కాని, కుమారి (పెళ్లికాని పక్షాన) అని గాని ఉండాలి గాని, శ్రీ అని ఉండడం సబబుగా లేదు.

కేవలం 'తిరుపతమ్మ కథ' అన్నా బాగుండేది.

తురగా శేషాచలం (బొంబాయి) ★

పైవారం నుంచి!

హైదరాబాదు

సినిమావార్తలు!

# దేశ రక్షణకై ఆయుధాలు
# ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!

ఆంధ్రసచిత్రవార
# పత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 18—10—63
శోభకృన్నామ సం॥ (అధిక) కార్తిక శుద్ధ ప్రథమ
సంపుటము 56 సంచిక : 7

స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వారా (Air Mail) : బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా : 135.00.)
*
విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1





వర్ధమాన నటి గీతాంజలి.

# మనలోమాట

శ్రీరామచరిత మానస్ గురించి శ్రీ ఎఫ్. ఎస్. గ్రౌస్ ఇలా వ్రాశారు : "The book is in every one's hands, from court to the cottage, and is read, or heard, and appreciated alike by every class of Hindu, whether high or low, rich or poor, young or old" శ్రీరాముని కథ హిందీ భాషలో ఇంత మందికి అందజేసిన శ్రీ తులసీదాసు రామచరిత్ మానస్ ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకులకు అందజేయ గలిగినందులకు సంతోషిస్తున్నాము. తెలుగు పాఠకలోకంలోకూడా ఈ అనువాదం శ్రీ గ్రౌస్ చెప్పిన ఆదరాభిమానాలను పొందగలదని ఆశిస్తున్నాము.

'భక్తమాల' అనే గ్రంథంలో ఒక చిత్రమైన కథ ఉంది : శ్రీ తులసీదాసు భార్య ప్రేరేపణవల్ల రామభక్తునిగా మారి వారణాసికి తరలిపోయి కొంత కాలం నివసించి, ఆ తర్వాత చిత్రకూటానికి వెళ్లి అక్కడ హనుమంతుని స్వయంగా కలుసుకున్నాడుట. హనుమంతునివద్ద కొన్ని శక్తులు వరంగా పొందాడుట. ఇది విన్న షాజహాన్ చక్రవర్తి అతన్ని శ్రీరాముడు ప్రత్యక్షం అయేట్లు చెయ్యమని ఆజ్ఞాపించగా తులసీదాసు అంగీకరించలేదు. చక్రవర్తి అతన్ని నిర్బంధించాడు గాని కోతులు దండులు దండులుగా వచ్చి కారాగృహాన్ని, పక్క కట్టడాలని నాశనం చెయ్యడం ప్రారంభించటంవల్ల ప్రజలు తులసీదాసుని విడిపించవలసిందిగా కోరారు. షాజహాన్ అతన్ని వదిలి తన పొరపాటుకి పరిహారం ఏమి కావాలని అడుగగా తులసీదాసు చక్రవర్తి ఢిల్లీ వదలిపోవాలని చెప్పాడు — ఢిల్లీ రాముని పట్నం కాబట్టి. షాజహాన్ అదేవిధంగా కొత్త రాజధాని, షాజహానాబాద్ నిర్మించాడు. తులసీదాసు బృందావన్‌కి తరలి వెళ్లిపోయాడు.

శ్రీ తులసీదాస్ 1532 లో జన్మించాడు. 1623 వ సంవత్సరంలో మరణించాడు.

*   *   *

రామచరిత మానస్ అనువాదకులు శ్రీ ముంగర శంకరరాజుగారి ఫోటో, జీవితానికి సంబంధించిన కొన్ని వివరాలు ఈ సంచిక 45 వ పేజీలో చూడవచ్చు.

# లోకంపోకడ



"బంగారు నియంత్రణం మార్పు చేశారంటే అర్థం నీ పాతనగలన్నీ చెడగొట్టి కొత్తవి చేయించుకోమనా ఏమిటి !"

# విషయానుక్రమణిక


"రాజ్యాంగంలోని 17 వ సవరణను ఒప్పుకుంటున్నట్లేనా?.... జవాబు రావటం లేదే! అంటే మౌనం అంగీకార సూచకమన్నమాట"
పార్టీ విప్
కాంగ్రెస్ సభ్యులు


అరే! నావెనకూ డా చిన్నపాములు చేరుతున్నాయన్నమాట!
ముఠాతత్వాలు


ఆంధ్రప్రదేశ్‌లో ఒకమత్తిమరుపు డాక్టరు బాగున్న కాలికే శస్త్రచికిత్స చేశార్ట!
ప్రజల అవసరాలు
అభిప్రాయ భేదాలలో


17 వ రాజ్యాంగసవరణ
సహకార సేద్యం
పులికి శ్రమలేని విందు!

శ్రీకృష్ణ

# తీర్మానాలకు దూరమవుతున్న కాంగ్రెస్
# రాజకీయోద్యోగులమయమైన సచివాలయం!

చలికాలం ఇప్పుడిప్పుడే చల్లగా న్యూఢిల్లీలో ప్రవేశిస్తోంది. మూడువారాల క్రిందటకన్న ఇప్పుడు వాతావరణం కాస్త హాయిగా ఉంది. ముఖ్యంగా ఉదయంపూట ఎంతో చక్కగా ఉంది. తోటలు వేసుకుందామనుకుంటున్న వాళ్లు కలుపులు తీయటం ప్రారంభించారు. అంటే ఢిల్లీ నగరంలో మళ్లీ సందడి రోజులు ప్రారంభమవుతున్నాయన్నమాట.

కామరాజ్ పథకం విషఫలం మాదిరై పోయింది. దానివల్ల, కాంగ్రెసులో లోపల మరుగుతున్న కలహాగ్ని బయట పడిపోయింది. మహాత్మా గాంధీ స్థాపించిన కాంగ్రెసు సంస్థలో ఇప్పుడు పదవీలాలస, తృష్ణలు ఎంత నిబిడంగా ఉన్నాయో ఈ పథకం ఎత్తి చూపింది. ఆత్మ సుఖంకన్న అన్యసుఖం అన్న నినాదం పోయి ఆత్మ సుఖమే మిన్న అనే నినాదం బలిసిపోయింది.

ఉమ్మడి మంత్రి మండలులను కాంగ్రెస్ అధిష్ఠాన వర్గమే నిర్ణయం చేసిందంటున్నారు. అసలు మొట్టమొదటగా గాంధేయ పద్ధతుల మీద మన ప్రధానమంత్రి కేంద్రమంత్రి వర్గాన్ని నిర్మిస్తూ శ్రీ హనుమంతయ్యను మంత్రివర్గంలోలోకి తీసుకోటానికి సిద్ధపడవచ్చును. గాంధేయ మార్గాలు అని వేటిని అంటున్నానంటే, ఇతరులకు చెప్పేదే తాను చేయటంగా మహాత్మా గాంధీ అనుసరించిన పధితిని. పిల్లలందరు బళ్ళు మానేయాలని నివాదం ప్రారంభిస్తూ మహాత్మాజీ అందరికన్న ముందుగా తన పిల్లలనే, ప్రభుత్వం నడిపే బళ్ళనుంచి మాన్పించేశారు. ఒకపక్క విరోధ తత్వాలు పెరుగుతున్న రాష్ట్ర మంత్రి మండలులలో ఏకీభావంతో పరిపాలన సాగుతుందని కాంగ్రెస్ అధిష్టాన వర్గం ఎలా అనుకుంటుందిటా ?

లక్నోలో ప్రసంగిస్తూ ప్రధానమంత్రి, కాంగ్రెస్ సిద్ధాంతాలను అంగీకరించలేని వాళ్లు వదిలి పోవలసిందని అన్నారు. నాగపూర్ సమావేశంలో కూడా ఇదే పునశ్చరణ చేశారు. ఇవ్వాళ్టికూడా ఎవరూ బయటికి పోలేదు సరికదా, అసలు కాంగ్రెసే నాగపూర్ తీర్మానానికి అలాఅలా అతి దూరంగా పోతోంది.

ప్రధాని నెహ్రూ ప్రభుత్వం అనుసరిస్తున్న సామ్యవాదాన్ని గూర్చి ఒకమాట. ఈసామ్యవాదం ప్రారంభమైంది యూరప్‌లో. ఇది యూరప్ చరిత్రలోనే చాలా ప్రధానమైన పాత్ర వహించింది. రష్యాలో లెనిన్‌కు, జర్మనీలో హిట్లరుకు దేశాలను అప్పచెప్పినవాళ్ళు సామ్యవాదులే. కాంగ్రెస్ శంఖంనుండి వచ్చిన సోషలిజంలో ధన సంపదంతా ఓ ఇరవై కుటుంబాల చేతుల్లో ఉండిపోయింది. ఈ కుటుంబాల చిట్టాను పరిశ్రమలమంత్రి శ్రీ కనుంగో పార్లమెంటు ముందర ఉంచారు. ఈ సంపత్కేంద్రీకరణం అనేదీ కేవలం కాంగ్రెస్ కళ్ళు మూసుకుని వున్నందువల్ల జరిగింది కాదు. క్రమపద్ధతిమీద పథకాల మీద జరిగింది.

భారతదేశాన్ని పరిశ్రమల మయం చేద్దామనే ప్రతిపాదన ఒకటుంది. ఇందుకోసమని బ్రిటన్ 'వివక్షతతో కూడిన రక్షణ' పథకాన్ని ఏర్పరచింది. ఈ పథకం ప్రకారం రక్షణను భారతదేశంలో ముడిసరుకు లభ్యమయ్యే పరిశ్రమలకే ఇచ్చారు. అయితే రక్షణ కల్పించటం అనేది దిగుమతులను నిషేధించటం ద్వారా గాక, మనదేశపు వస్తువులతో పోటీకి వచ్చే విదేశీ దిగుమతుల ధరలను పెంచటం ద్వారా కల్పించటం జరిగింది. ఈ రక్షణ ముద్రవల్ల ఒరిగిందేమిటయ్యా అనచ్చు. ఈ చర్యవల్ల భారతదేశపు తయారీల నాణ్యత,

45 వ పేజీ చూడండి



అక్టోబరు 2 వ ప్రధానినెహ్రూ సూత్రయజ్ఞం సాగిస్తున్నప్పటి చిత్రం

# కథ కాని కథలు

## క్రొత్త గొడుగు

ఒకరోజు వర్షం వచ్చేటట్లుగా ఉంటే బజారులో ఒక గొడుగు కొని సిటీ బస్సు ఎక్కాను ఆఫీసుకు వెళ్ల టానికి. బస్సు ఎక్కగానే వాన కురవ సాగింది. ఆ బస్సులోనే మా ఫ్రెండు రామం ఉన్నాడు. కలెక్టరు ఆఫీసులో ఏవో ఇంటర్వ్యూలు జరుగుతున్నాయట, అందుకని బయలుదేరానన్నాడు. అతడు చాల ఇంటర్వ్యూలకు వెళ్లాడు. కాని అతని పని వెళ్లటం రావటంగానే ఉంది. "ఈసారి మాత్రం తప్పకుండా రావచ్చురా! మంచి సిఫార్సు చేయించాను" అన్నాడు. ఇంతలోనే బస్సు దిగేచోటు వచ్చింది. బస్సు దిగేటప్పటికి వాన పెద్దదైంది. సరే ఇద్దరం నా గొడుగులో బయలు దేరాము. వాన ఎడా పెడా కొట్టటం చేత, ఇద్దరికి గొడుగు సరిపోకపోవటం చేత ఇద్దరం తడిశాము. కలెక్టరు ఆఫీసు వరండాలోకి వెళ్లి గొడుగు ముడుస్తున్నాను. మా ఫ్రెండు "నన్ను చంపేశావురా" అన్నాడు. 'ఏమిటిరా?' అని చూస్తును గదా. ఇంటర్వ్యూకి వేసుకు వచ్చిన వాడి తెల్లని ప్యాంటు షర్టు, నల్లని చారలు, చుక్కలతో నిండిపోయినాయి. "ఈసారేనా ఉద్యోగం వస్తుందేమో అని ఆశ పెట్టుకున్నానురా దీన్ని కాస్తా నీ గొడుగు పుణ్యం కట్టుకుంది" అని బాధగా అని విచార మైన ముఖం పెట్టాడు. నాకు వాణ్ణి చూస్తే నవ్వు వచ్చింది. జాలీ వేసింది. చేసేదేముంది. ఇంటర్వ్యూ పైమైంది. లోపలికి వెళ్లి వెంటనే బయటికి వచ్చాడు. 'ఏరా! అంటే' 'దేనికిరా ఇంకా ఆశపెట్టుకోవటం అనవసరం అన్నాడు నీరసంగా' పోనీలేరా అని సమాధానపరచవలసివచ్చింది వాణ్ణి. కాని ఆశ్చర్యం ఏమిటంటే సెలక్షన్ లిస్టులో వాడే ఫస్టు చాలా సంతోష మైంది. అప్పటి నుంచి ఎవరి క్రొత్త గొడుగులోకన్నా వెళ్లాలంటే నాకు భయం.

రామకృష్ణ (బందరు)

* * *

## దొరకాని దొర

జంక్షన్‌లో నిలబడి జేబులో ఉన్న ఆఖరి సిగరెట్టుతీసి వెలిగించాను. 'లైటర్, ప్లీజ్' చెయ్యిచాపాడొక మాసిన సూటువాలా, రెండో చేత్తో సిగరెట్‌ని నావేపు గురిపెట్టి. ముట్టించిన దాన్ని తీసిచ్చాను. ఇవ్వగనే దాన్ని నోట్లో పెట్టుకుని, చేతిలో దాన్ని పాంటులో పెట్టుకుని మామూలుగా నడుచుకుంటూ ముందుకు వెళ్ళిపోయాడు.

రావుగారు (రాజమండ్రి)

* * *

## పరిచయంలేదు!

అవి మేము మిడిల్ స్కూల్లో చదువుకొనే రోజులు సెలవులు అయ్యాక బళ్లు తెరిచారు. చాలా మంది కొత్త పిల్లలు మా క్లాస్‌లో చేరారు. ఆ వేళ కూడా ఒక అమ్మాయి కొత్తగా చేరింది. హిస్టరీ టీచరుగారు పాఠం చెపుతూ అందర్నీ ప్రశ్నలడగటం మొదలు పెట్టారు. ఒక పాఠం చెపుతూ వెను కటి పాఠాల్లో ప్రశ్న లడగటం ఆవిడకు అలవాటు. "ఝాన్సీలక్ష్మి బాయి ఎవరు?" అంటూ కొత్తగా చేరిన అమ్మాయిని ప్రశ్నించారు. వెంటనే ఆ అమ్మాయి లేచి "నేను ఇవ్వాళ్లే కొత్తగా చేరాను మేడమ్! ఇంకా ఎవరూ పరిచయం కాలేదు." అంది. దాంతో మే మంద రము నవ్వాము. ఆ అమ్మాయి తప్పు తెలుసుకొని తలవంచు కొన్నది. అప్పుడు మా టీచరుగారు మమ్మలను చూచి "ఎందుకు నవ్వు తున్నారు? ఝాన్సీ లక్ష్మీబాయి పాఠం చెప్పినప్పుడు ఆ అమ్మాయి లేదుగా?" అన్నారు. దాంతో మా నోళ్లు రక్కున మూతపడ్డాయి. గర్వంగా తలెత్తి చూసింది ఆ అమ్మాయి.

ఎం. జానకీదేవి (శిరికొండ)



# బిచ్చగాళ్ళ బెడదల భాగ్యనగరం! ఆచరణ కోల్పోతున్న గాంధీ సూక్తులు

రక్షణ మంత్రిగా శ్రీ వై. బి. చవన్, హైదరాబాదు ప్రప్రథమంగా వచ్చారు. రక్షణ సన్నాహాలు ఏమాత్రం చురుకుగా సాగుతున్నాయో చూసిపోవటానికి వచ్చామన్నారు. వచ్చాం కాబట్టి, ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు వ్యవహారాలు కూడా కొన్ని తెలుసుకున్నామన్నారు. ఆయన వచ్చిన పనిని గురించి గోరంతలు కొండంతలుగా, చెప్పుకోకుండా ఈవిధంగా అని ఉండవచ్చు. కాంగ్రెసు వర్గాలలో ఆయన వస్తున్నా డనంగానే సంచలనం కలిగింది. రాంగానే సంప్రదింపులు ప్రారంభమయి నాయి. రెండు వర్గాలవారు తమ తమ అభిప్రాయాల్ని స్పష్టంగా విశదీకరించారు. అన్నీ విని బాగా ఉన్నాయనుకొని వెళ్ళిపోయారు చవాన్‌గారు. ఆయన ఇక్కడకు వచ్చిన తర్వాత చేసిన ప్రకటన చూసి, రక్షణ సన్నాహాలు పరిశీలించటానికి వచ్చినట్టు తెలుసుకున్నారు గాని, అంతకుముందు నుంచి ఆయన వస్తున్నాడంటే కాంగ్రెసు వ్యవహారాల పరిశీలనకేననే యిక్కడి ప్రజ అభిప్రాయం. దృఢకాయుడు, పట్టుదల కలవాడు, పరిపాలనా దక్షత గలవాడు, బొంబాయి వంటి గొప్ప రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉంటూ నెగ్గివచ్చి రక్షణ మంత్రయ్యాడు. ఈమధ్య బొంబాయిలో జరిగిన సమ్మెను విరమింపచేయటంలో కూడా ఆయన వహించిన ప్రముఖపాత్ర అందరికీ తెలిసిందే. ఆయన ప్రభావం అలాంటిది. ప్రజల్లో సడలిన విశ్వాసాన్ని, ఈ రక్షణమంత్రి మెల్లి మెల్లిగా రాబట్టుకుంటున్నాడు.

బిచ్చగాళ్ళ బెడదను గురించి ఎంతోమంది ఎన్నో విధాల రాసిపారేశారు. ఇంకా రాసేస్తూనే ఉన్నారు. ప్రతినోటా రోజు కొకసారైనా, అబ్బ, వీళ్ళతో చచ్చిపోతున్నాం అనే మాట వింటూనే ఉన్నాం. ఈ అనేవాళ్ళు ఎవ్వరూ కూడా ధర్మబుద్ధికి స్వస్తిచెప్పినవాళ్ళు కాదు. తృణమో, ఫలమో, నయాపైసో సమర్పించుకుంటూనే ఉంటారు. వీటితో వాళ్ళ ఆకలిదప్పులు తీరవు. ఏదో యిచ్చామనే సంతృప్తి మాత్రం 'ప్లస్' గా కనిపిస్తూ ఉంటుంది. అనకూడదు గాని, యీ బిచ్చగాళ్ళ సమస్య, విశాల హైదరాబాదు పట్టణంలో మహా ఘోరంగా పరిణమించిందంటే అతిశయోక్తి ఏమీ లేదు. ఇట్లా అంటారు గాని, ప్రతిచోట్లా యిట్లాగే ఉంది లెస్తురూ అనేవాళ్ళు కూడా లేకపోలేదు. ఇంతకీ బిచ్చగాళ్ళను బాహాటంగా తిరగటాన్ని నిషేధిస్తూ ఈనెల ఒకటవతేదీ నుంచి, పట్నంలో కొంత మార్పు తీసుకురావటానికి ప్రయత్నించటం ముదావహమే! అయితే ఈ చట్టం ఈనాడు అమలులోకి వచ్చింది కాదు. ఎప్పటి నుంచో ఉన్నదే! కాని, దానిని అమలు చెయ్యటాన్ని ఒకటవ తేదీనుంచి ప్రారంభించారు. పురపాలక సంఘంవారి లెక్కల ప్రకారం జంట నగరాల్లో అయిదువేల దాకా బిచ్చగాళ్ళున్నారుట ? అంటు వ్యాధులతో బాధపడుతున్నవాళ్ళు షుమారు రెండు వేలుట !

ఇక ఈ చట్టాన్ని అమలుచేస్తున్నాం గదా అని సంబరపడితే ప్రయోజన మేమీ లేదు. అసలు సమస్యకు యీ చట్టం ఏమాత్రం పరిష్కార మార్గం సూచించటంలేదు. అడుక్కోవద్దంటే, మాకు ఏదైనా వృత్తి ఇంకోటి చూపించమంటున్నారు. అడుక్కోవటం కూడా పెద్ద ఘనమైన వృత్తి అయినట్టు! పెద్ద పెద్ద చదువులు చదివి, డిగ్రీలు పుచ్చుకుని రెడీగా ఉన్నాం, ఉద్యోగాలు చెయ్యటానికి అని వూగిపోతున్న యువకులకే ఉద్యోగాలు లేవు, సద్యోగాలు లేవు. మరి యీ బిచ్చగాళ్ళ స్థాయిలో ఉన్నవాళ్ళకి ఉపాధి చూపించటం ఎట్లా? ఇక్కడే పెద్ద పొరపాటు, అసలు ఇలాంటి వాళ్ళకు ఏదో ఒక వృత్తి చూపించటం మహా సులువు అంటారు కొంతమంది. వాళ్ళమాట మాత్రం కాదనటం ఎందుకు ? ఉద్యోగాలు కల్పిస్తుంటే కాదనేదెవరు ? రెండు వందలమంది ఉండటానికి

47 వ పేజీ చూడండి



రక్షణమంత్రి శ్రీ చవాన్ సెప్టెంబరు 26 న హైదరాబాదు వచ్చినప్పుడు బొలారంలోని ఇ. ఎం. ఇ. స్కూల్‌ను సందర్శించారు.

# సరాగమాల

వి ఎ కె రంగారావు

మన చిత్రాలలో ఎన్నోరకాల పాటలు ఉంటాయి. వాటిలో భక్తిగీతాలకు, ప్రేమగీతాలకు, రచనలో ఇవ్వబడిన ప్రాముఖ్యత "వేంప్" పాత్రధారులు పాడే పాటలకు ఇవ్వటం జరగదు. ఇందువలన, సాధారణంగా ఆ పాట ఉండే సన్నివేశానికి పాట ఉండాలనే ఉద్దేశం తప్ప మరొక బలమైన కారణం కాకపోవుటవలన, ఆ పాట, ఆ సన్నివేశం రెండూ పేలవంగా తయారవటం తరుచు జరుగుతున్న విషయమే.

అంటే అసలెప్పుడూ "వేంప్" పాటల్లో చక్కటి రచనలు రాలేదనికాదు. ఎప్పుడో వచ్చిన 'దేవత'లోనూ (జాగేలా—వెరపేలా, త్రాగుము రాగ సుధారసమూ, అనురాగసుధ రసమూ— సముద్రాల), ఆ మధ్య వచ్చిన 'భాగ్యరేఖ'లోను (కన్నె యెంత సుందరీ, సన్నజాజి పందిరీ— దేవులపల్లి), 'కూతురు కాపురం'లోను (వన్నెల చిన్నెల కన్యనురా, నిన్నేవలచిన ధన్యనురా—బాథర్) కొన్ని వేంప్ సాంగ్స్, మంచి సాహిత్య మనిపించుకో దగ్గవే, ఉన్నాయనుకొండి. కాని ఇటువంటివి చాలా అరుదు.

పై పాటల్లో యే పాటనైనా గమనించండి. మొదటి నుంచి చివరిదాకా ఒకే వూహ కొనసాగుతుంది. పల్లవిలో ఒక ఉద్దేశం, చరణంలో మరొకటి ధ్వనించదు. ఒక సుగంధం పల్లవిలోను, అనుపల్లవిలోను అన్ని చరణాలలోను ఉంటుంది. ఇటువంటి ఉత్తమ రచనల కోవకు చెందినదే ఇప్పుడు నేను పరిచయం చేయబోయే పాట.

అనుబంధాలు జి. ఇ. 35387

'నా పేరు సెలయేరు
నన్నెవ్వ రాపలేరు
తడియారని వలపులతో
తరలిపారలి తిరిగేను
ఎంతటి శిలకైనా
గిలిగింతలు సలిపేను.
ఎంతటి మునినైనా
నా చెంతకు లాగేను.
నా తనువు నిలువదొక చోట
నా మనసు చూపిందె బాట
నా గలగల నడకలతో
శ్రుతి కలపని వారెవరు
నా కలకల నవ్వులతో
మదికరగని వారెవరు
నా పైన మరులు గొనువారు
ఆ పైన తిరిగిపోలేరు.

ప్రతి చరణంలో కూడ ఇటు సెలయేటి పరంగా, అటు సింగారమే బంగారంలా జీవించే స్త్రీపరంగా చెప్పుకోదగ్గ అర్థమున్నది. ఈ దంద్వార్థం తెచ్చి పెట్టుకున్నట్టుగా లేక అతిసహజంగా అతి సరళంగా ఉండటం మరొక ప్రత్యేకత. ఈ పాటలో అన్ని అందాల భావనలు ఒక యెత్తు 'ఎంతటి మునినైనా, నా చెంతకు లాగేను' అన్నది ఒక యెత్తు. అవును మరి యెంతటి మునియైనా మున్కలిడ నదికిరాడా ? అది ఆజాణ ఉద్దేశము అలానే యెంతటి వాడైనా తన అందం ముందు తలవంచవలసినదే అని. రచనలో ఈ అందము ఆ వెరజాణ సి. నారాయణరెడ్డి ప్రభావము.

పై పాటను కైపుతో మత్తుకలిగించేలా పాడినది ఎల్లారీశ్వరి. ఆమె కంఠంలో ఉండే హొయలు, అందాలు సరిగా అవగాహన చేసుకొని వరస చేయుటవలన ఈ పాటలో ఆమె పాడటంలోని అందాలే తెలుస్తున్నవి. అవధులు తెలియడంలేదు.

రెండవ ప్రక్కనున్న 'అందుకే తొందరగా ఉన్నదీ' కూడా సి. నా. రే రచనే. కాని పై పాటకు ఈ పాటకూ అంతస్తులో యెక్కడా సంబంధం లేదు. ఈ పాట దానికదే చూచినా, అతి సాధారణమైనది 'నా పేరు సెలయేరు'కు సరిపోల్చితే ఇంకా నాసిగా ఉంది. సి. నా. రేకి తగనిది. ఈ రచనలోని లోపాన్ని చాలమట్టుకు జమునారాణి కనపడనివ్వకుండా చేసింది. అంత మొండిగా బండగా ఉన్న మాటలు ఆమె కంఠంలో ముద్దుగా ఉన్నాయి.

ఈ రెండు పాటలలోను సమాన స్థాయిలో ఉన్న ఒక ఆకర్షణ కొత్త సంగీత దర్శకుడు ఎం. బి. శ్రీనివాస్ ప్రతిభ కూర్చిన వరుసలు, అమర్చిన వాద్యగోష్టి అంత ప్రజ్ఞావంతంగా, అపూర్వంగా ఉన్నాయి. పాశ్చాత్యధోరణి సంగీతంలో వినిపించమంటే దడాబడా శబ్దాలు చేయటం అనే ఉద్దేశం ఈ శ్రీనివాస్‌కి యేమాత్రం ఉన్నట్టు లేదు. ప్రతిస్వరం అతిలలితంగా, ప్రతివాద్యం అతి సున్నితంగా, ప్రతివొంపు అతి సొంపుగా ఉండేటట్టు మలిచారు ఈ రెండు పాటలనీ. వీరి చాతుర్యాన్ని గుర్తించి దర్శక— నిర్మాత రామకృష్ణ తమ భరణీకి తీయబోయే కొత్త చిత్రానికి ఎం. బి. శ్రీనివాస్‌నే సంగీత దర్శకునిగా నియమించారు. శుభం !

పునర్జన్మ వెం. 69782

ఈ చిత్రంలో మొట్టమొదటి పాట ఈ పాట. 'ఎవరివో' అన్నది. శ్రీశ్రీ రచన. ఘంటసాల గాత్రం. చలపతిరావు సంగీతం. మొదలు 'ఓ సజీవ శిల్పసుందరీ, నా జీవన రాగమంజరీ' అని. అన్ని పాటలు ఒకే దృష్టిలో చూసేవారికి 'పునర్జన్మ'లో 'అందగాడా' నచ్చినా, పురుష కంఠంతో వినపడిన పాటలంటేనే మోజున్న వారు మెచ్చేది ఈ పాటేనని చెప్పవచ్చును. దీనికి కారణాలున్నవి. మొదటిది శ్రీశ్రీ చక్కని రచన. 'నీ కరకంకణ నిక్వణమా, అది వాణీ వీణానినాదమా,' 'నీ పద మాపుర నిస్వనమా, అది జలధి తరంగ మృదంగ



రఘురాం ఫిలింస్‌వారి ''కలవారి కోడలు''లో చలం, రామారావు, పద్మనాభం, రమణారెడ్డి.

**రావమ్మా,'** అన్న పదాల కూర్పు చదివినా, వినినా; మనసులోనే ఒక నాట్యరాణి అందెలు ఘల్లనక పోవు. ఒడలు జల్లుమని పులకరించక మానదు. రెండవ కారణం ఘంటసాల నిండైన గాత్రం. మూడవ కారణం టి. చలపతిరావు యమన్ కల్యాణికి భూప్ రాగచ్ఛాయలతో అందాలు దిద్దిన వరుస. వాద్యగోష్ఠిలో నృత్యాని కనువైన దరువులు. నాల్గవ కారణం పాటలో మలుపు మలుపుకీ సరియైన ప్రాధాన్యత చేకూర్చేలా ఉండే చిత్రీకరణ. 'నవ వసంతమున నందన వనమున కోయిల పాడిన పాటయో' అన్న ప్రశ్న ఈ పాటకే వర్తించవచ్చు.

*   *   *

కొన్ని వారాల క్రిందట గ్రామఫోన్ కంపెనీ వారి రికార్డింగ్ శాఖాధిపతులైన పి. మంగపతి కొత్త కంఠరాల కోసమై రాయలసీమ పర్యటించారు. కడప, ప్రొద్దుటూరు, ఆదోని మొదలగు వూళ్లలో ఔత్సాహిక గాయకులు పాడగా విన్నారు. వారిలో అదృష్టదేవత కాంట్రాక్టు రూపంలో యెవరిని వరిస్తుందో తెలియదు కాని ఒకరిచే పాడించే ఉద్దేశం ఉందని అనధికార వార్త. మంగపతి నడిగితే ఇంకా యెవరినీ నిర్ధారణ జరగలేదని, అసలు రికార్డింగ్ కాగానే తెల్పుతామని అన్నారు.

*   •   •

తెలియవశమా పలుకగలమా
ప్రేమ మహిమా, ఆహాహా''

ఎందులోనిది ? ఎవరు పాడింది తెరమీద, వెనుక? ఎవరి సంగీతం ? ఎవరి రచన? ★

# అవీ - ఇవీ - అన్నీ

## 'సుజాతచిత్ర' ప్రారంభోత్సవం

వాహినీ స్టూడియోలో ''సుజాత చిత్ర''వారు నిర్మించబోయే జానపద చిత్రానికి ప్రారంభోత్సవం జరిగింది. స్విచ్ ఈ చిత్ర నిర్మాత కె. వెంకటేశ్వరరావు నొక్కారు. హీరో బాలయ్య క్లాప్ కొట్టారు. మంత్రివేషంలో ఉన్న మిక్కిలినేనితో మొదటి షాట్ తీశారు.

ప్రారంభోత్సవానికి ఛీఫ్‌గెస్టు శ్రీ యన్. టి. రామారావు. వారికి నిర్మాత పూలమాల వేశారు. ఇంకా శ్రీ త్రివిక్రమరావు, శ్రీ డి. బి. నారాయణ శ్రీ నాగయ్య మొదలగువారు కూడ హాజరయ్యారు.

ఆ రోజు షూటింగ్‌లో మిక్కిలినేని, రాజనాల పాల్గొన్నారు.

అది ధర్మపురి రాజభవనం— దానిలో మంత్రి మండపం.

''శ్రీరస్తు— శుభమస్తు ! వచ్చే శుక్రవారం మహారాజా కుమార్తె జన్మదినోత్సవం కనుక ఆ సందర్భంలో మీరంతావచ్చి యువరాణిని ఆశీర్వదించవలసిందిగా శ్రీ రాజాధిరాజ రాజపరమేశ్వర ధర్మపురి రాజావారి ఆహ్వానం.—'' లేఖ పూర్తి అవుతుంది.



రఘురాం ఫిలింస్ "కలవారి కోడలు"లో గిరిజ.

''ఈ లేఖను మహారాజాగార్కి వినిపించు. సామంతులందర్కి లేఖలు పంపించండి.''

మంత్రి పచార్లు చేస్తూ కిటికి దగ్గరకు వస్తాడు. కిటికీ దగ్గర ప్రక్కనున్న స్తంభానికి ఒక బాకువచ్చి గుచ్చుకుంటుంది. మంత్రి ఆశ్చర్యంగా చూస్తాడు— తీస్తాడు.

''ఎవరూ !''

బందిపోటుదొంగల నాయకుడు ఎదురుగా వస్తాడు.

''నేను— భీము.''

''ఆ ! భీముడు !'' (ఆశ్చర్యంగా)

''ఆశ్చర్యపడుతున్నావా ! మహామంత్రీ ! నేను ప్రేతాన్నికాను. సజీవంగా ఉన్న భీముడ్నే.''

''నేను ఆశ్చర్యపడుటలేదు. నువ్వు తప్పించుకుంటావని ముందే తెలుసు.''

బిగ్గరగా భీముడు నవ్వి ''నేను తప్పించుకుంటానని తెలిసే మహారాజును ప్రోత్సహించి నాకు ఉరిశిక్ష వేయించావా ? మహామంత్రీ ?''

''అది ప్రజల కోరిక''

''ఇప్పుడు నా కోరిక. పగ—రక్తానికి రక్తం, ప్రాణానికి ప్రాణం.''

''భీమూ''— (కోపంగా)

''మంత్రీ ! నీ ఇష్టానుసారం నేను ఎన్నో ఘోరపాతకాలు చేశాను. రాజ్యంలో అశాంతి,

49 వ పేజీ చూడండి



'దిల్ ఏక్ మందిర్‌'లో' ఒక దృశ్యం.

వనితాలోకం

# సానుభూతి

## ఉప్పులూరి దుర్గాంబ

ప్రతిమనిషికి ఏదో ఒక సమయంలో కొద్దో గొప్పో సానుభూతి పొందవలసిన అవసరం కలుగుతుంది. సరియైన సమయంలో సానుభూతి చూపేవారు లేకాపోతే కొందరి జీవితాలు విషాదాంత పరిణామాలకు దారితీస్తా యనడంలో సందేహం లేదు. తప్పులు చెయ్యడం, ఇబ్బందిలో పడడం మానవ సహజం.. కావాలని తప్పులు చేసేవారి సంగతి కాదు. నే నిప్పుడు చెప్పేది. పొరపాటువల్లో, పరిస్థితులవల్లో అందరం ఎప్పుడో ఒకప్పుడు తప్పులు చేసివున్నవారమే. "తనదాకా వస్తే తంటాయే లేదంటారు". మన స్వంత విషయమైతే అర్థం చేసుకోమని అర్థిస్తాం. కాని ఇంకొకరి విషయమైతే ఎత్తిపొడవడానికే ప్రయత్నిస్తాం. అది మానవ లక్షణమేమో.

సంఘంలో ఎందరో వ్యక్తుల్ని మనం చూస్తూ ఉంటాం. అందరిలోనూ ఏదో లోపం కనిపెట్టి సంతృప్తి చెందుతూ ఉంటాం. ఎదురింటి కామాక్షిగారు వారి పక్కింటి మీనాక్షి అత్తగార్ని వెళ్లగొట్టిందని చెప్పినప్పుడు, సాధారణంగా ఆ అత్తగార్ని గురించి మనం సానుభూతి చూపి, కోడలిగార్ని నాలుగు మాటలని మర్నాడు ఆవిడ మొహం కనిపించినప్పుడు అసహ్యంగా ఒక చూపు విసిరి ప్రక్కకు తప్పుకుంటాం. అంతవరకూ సరే. కానీ మీనాక్షిగారు అత్తగార్ని ఇంట్లోంచి వెళ్లగొట్టడానికి కారణం ఏమిటో తెలుసుకోడానికి ఎంతమంది ప్రయత్నిస్తాం? ఏ వ్యక్తికీ కూడ తను లోకం దృష్టిలో చులకనై హీహ్యంగా చూడబడాలని ఉండదు. పరిస్థితులు మనిషిని బలహీనుణ్ణిగా చేస్తాయి. అందరూ 'అత్తని వెళ్లగొట్టిన కోడలని' అసహ్యంగా తనవేదో భూతాన్ని చూస్తూ ఉన్నట్టు చూస్తే అసలు కారణం తెలియని మనం ఆ ఫలానా మీనాక్షి హృదయం ఎంత క్షోభిస్తూ ఉంటుందో ఆలోచించలేము.

అయిదేళ్ల బాబిగాణ్ణి అణా తీశాడని వాళ్లమ్మ గదమాయిస్తోంటే బిక్కచచ్చి బాబిగాడు ఆరున్నొక్క రాగం ఆలాపిస్తాడు. "వాడు తీయలేదంటుంటే వినిపించుకోవేం?" అని తండ్రి తల్లిని కేకలేస్తే బాబిగాడు తండ్రి తనమీద సానుభూతి చూపిస్తున్నాడని గ్రహిస్తాడు. వెంటనే నాన్న దగ్గర చేరి "మరేం ఎదురింటి పాపాయికి వాళ్లమ్మ అణా యిస్తే ఐస్‌క్రీమ్ కొనుక్కుంది. నాకు లేదని వెక్కిరించింది. అమ్మేమో డబ్బుల్లేవంది. అందుకనేమో నీ జేబులో అణా తీసాను నాన్నా, మరెప్పుడు తియ్యను" అని అంటాడు అప్పటిదాకా అణా తనకి దొరికిందని దబాయిస్తున్న బాబిగాడు.

సానుభూతి చూపేవాళ్లుంటే సత్యం చెప్పాలనిపించడం సహజం. అపవాదులు వెయ్యడం వ్యాపింపచెయ్యడం చాల సులభం. కాని దురదృష్టవంతులైన తోటి వ్యక్తుల్ని సానుభూతితో అర్థం చేసుకొని నిజానిజాలు తెలుసుకోడానికి ప్రయత్నించడం కష్టం. కాని తెలిసీ తెలియని వార్తలతో మనలాంటివారే అయిన తోటి మానవుల మీద అభాండాలు వేసి నలుగురిలో చిన్నబుచ్చడానికి చూడడం మాత్రం సంస్కారవంతులు చెయ్యవలసిన పని కాదేమో!

ఒక వ్యక్తి దోషి అని విన్నప్పుడు అందులో గల నిజానిజాలు తెలుసుకోడానికి తగ్గ ఓపికా, అవసరం మనకు లేకపోవచ్చు. కాని, ఆ వ్యక్తి దోషి అని



రోమ్ నగరంలోని రోమన్ కేథలిక్ చర్చిలో దక్షిణ వియత్నాం అధ్యక్షుని మరదలు శ్రీమతి న్యూ, ఆమె కూతురు లీ ప్రార్థన చేస్తున్నప్పటి చిత్రం.

మరొకరిముందు చాటడంవల్ల ఆ వ్యక్తిమీద పెద్ద పెద్ద ప్రభావాలకు మనకు తెలియకుండానే మనం బాధ్యుల మవుతున్నాం.

అనవసర విషయాల్లో జోక్యం కలుగజేసుకోడంలో మగవాళ్లకన్నా ఆడవాళ్లే ఒక మెట్టు పైకి ఎక్కు రంటారు. అందులో నిజా నిజా లెలా ఉన్నా తోటివారిమీద సానుభూతి చూపడంతో మన జాతి కొంచెం వెనకే నేమో అనిపిస్తుంది. అది సంస్కార లోపమో మరేమో ఎవరికి వారే తేల్చుకోవలసిన విషయం.

అసాధారణమైన సంగతేదైనా జరిగినప్పుడు ముఖ్యంగా ఒక వ్యక్తి లౌకిక నడవడిని లోకం శంకించినప్పుడు ఆ వ్యక్తి తనకు తానే సంఘానికి దూరం అయిపోడానికి ప్రయత్నిస్తాడు. అథవా సంఘంలో ప్రవేశించినా, తను తప్పు చెయ్యకపోయినా కొన్ని సమయాల్లో నిస్పృహాయుడై తప్పు చేసినట్టుగా బాధపడతాడు. దాన్నే చిన్నతనం (Inferiority Complex) అనొచ్చు ననుకుంటాను. అటువంటి వ్యక్తి మనకు తారసిల్లినపుడు అతను లేక ఆమె మరచిపోడానికి ప్రయత్నిస్తున్న విషయాన్నే గుర్తుకుతెచ్చి నిష్ఠూరాలతో ఈసడింపులతో వారి గౌరవాన్ని కించపరచడం మానవత్వానికి మచ్చ తేవడం కాదంటారా ? ముఖ్యంగా అటువంటి పరిస్థితుల్లో ఉన్న వ్యక్తులకే సానుభూతి చాల అవసరం. ఉదాహరణకి. ఈమధ్య పేరంటంలో ఒకామెని కల్సుకోవడం తటస్థించింది. మామూలు పలుకరింపులు అవి అయ్యాక ఆమె నేను ఏదో పిచ్చాపాటిలో పడ్డాం. ఇంతలో అక్కడికి సన్నగా, పీలగా దిగాలుగా కనిపిస్తున్న పాతికేళ్లలోపు అమ్మాయి కూడ వచ్చింది. అందరూ ఒక్కసారి నిశ్శబ్దం అయిపోయారు. ఆమె ఎవరో తెలియని నేను కూడ మౌనం వహించాను. ఆ క్రొత్తామెను కనీసం కూచోమనేనా ఎవరూ అనలేదు. కూర్చోమని ఆమెకు నా ప్రక్కన స్థలం చూపించాను. ఆమె మౌనంగా బుర్ర వంచుకొని కూర్చుంది. గుసగుసలు మాత్రం చాల జోరుగా సాగుతున్నాయి. ఇంతలో ఇంతవరకూ నాతో బాతాఖానీ వేసిన పిన్నిగారు ఆ అమ్మాయి నుద్దేశించి "అయితే శ్యామలా నిన్ను నీ మొగుడు వదిలేశాట్టగా ఏం జరిగిందేమిటి ?", అని సూటిగా అడిగేశారు. ఈ హఠాత్ పరిణామా లకి అసలు కారణం నా కిప్పుడు తెలిసింది. ఆ అమ్మాయి కన్నుల్లో నీరు నాకు స్పష్టంగా కనిపించింది.

పిన్నిగారు ఇలాంటి ప్రశ్న వేయాల్సింది ఇటువంటిచోటా ? కాని అక్కడేమైనా అంటే నాలాంటి వాళ్లు ఎదుర్కోవలసి వచ్చే విపత్తులు చాలా ఉంటాయి అని తెలిసిన నేను ఆ అమ్మాయి పరిస్థితికి విచారించడం తప్ప మరేం చేయలేకపోయాను. మౌనం వహించిన ఆ అమ్మాయి దగ్గర్నుంచి కావలసిన సమాచారం రాబట్టలేకపోయిన పిన్నిగారు అసహ్యం, కోపం మేళవించిన ఒక చూపు ఆ అమ్మాయి వైపు విసిరి, 'పదమ్మా ఇంక వెళ్దాం' అని నన్ను కూడా ప్రయాణం కట్టించడంతో లేవక తప్పిందికాదు. దారి పొడుగునా ఆ అమ్మాయి గురించి లేనిపోని వేవో పిన్నిగారు చెప్తూనే ఉన్నారు. నేను 'ఊ' కొడుతూనే ఉన్నాను. కాని "పిన్నిగారూ ! ఆ అమ్మాయి పరిస్థితేమిటో కొంచెం ఆలోచించండి. భర్త దగ్గర్నుంచి వచ్చేసిందంటే అందుకు తగిన ఏవో కారణాలు ఉండే ఉంటాయి. సానుభూతితో అర్థంచేసుకోడానికి ప్రయత్నించడం మన కనీస ధర్మం. మీ కూతురే అటువంటి పరిస్థితిలో ఉంటే ఇలా ఎవరైనా ప్రవర్తిస్తే సహించగలరా ? కష్టాల్లో ఉన్నప్పుడే మనిషి తోటి వారి సానుభూతి కోరేది. ఆపద సమయంలో ఆదుకోకపోతే మానె, కనీసం సానుభూతి చూపించడం మానవులుగా మన కర్తవ్యం" అని ఎన్నో చెప్పాలి అనుకున్నాను. కాని అలా 'గీతబోధలాంటి' బోధనలు చెయ్యడంవల్ల కల్గు ఫలితాలు ఎలా ఉంటాయో చూచాయగా ఊహించగలిగి నాకు గొంతుక వరకూ వచ్చిన మాటలన్నీ మింగేయవల్సి వచ్చింది. దానికి పరిణామమే ఈ వ్యాస రూపం దాల్చింది.

పొరుగింటి భార్యాభర్తల పోట్లాట చాల దూరం పోయిందన్న సంగతి తెలిసీ కూడ మరొకరి ముందు నోరుజారని ఇళ్లాళ్లు మెచ్చుకోదగ్గవారు. పైవారి బలహీనతలను ఆసరాగా చేసుకొని మనం ముందుకుపోవా లనుకోడం కూడనిది. ఏదో ఒక నాడు అటువంటి పరిస్థితుల్లో మనం స్వయంగా పడవలసి వచ్చునేమో అని ఒక్క నిముషం వివేకంతో ఆలోచిస్తే మనం తప్పటడుగు వెయ్యకుండా జాగ్రత్త పడగలమేమో. ఒకరి ఆపదలో ఆదుకోలేని మనం అపవాదు వెయ్యడానికి హక్కుందనుకుంటాం. సాటివారు తప్పులే చేసి ఉండవచ్చు. వారి తప్పులన్నీ సరిదిద్దడానికి ప్రయత్నించలేని మనకి వారిని కించపరిచే అధికారం మాత్రం ఎక్కడిది ?

ప్రతివారు మహాత్ములు కాకపోవచ్చు. అందరూ దేశభక్తులుగానూ, సంఘ సంస్కర్తలుగాను పేపర్లలో కెక్కలేక పోవచ్చు కాని వివేకంతో ప్రయత్నిస్తే ప్రతి ఒక్కరూ సంస్కారం గలవారవుతారు. సంస్కారానికి చదువుకున్నవారు, చదువు లేనివారు అనే భేదం లేదు. ప్రగతి పథానికి సాగిపోతున్న మన దేశ స్త్రీ సంకుచిత భావాలకు అనవసర ప్రసంగాలకు దూరం కావాలి. అందరిని ఒకటి చేసేది, ఆపదలో ప్రతి వ్యక్తి చూపాల్సింది, కోరేది సానుభూతి అని గుర్తించాలని మనవి. ★




## గరల్స్ హైస్కూళ్లు

ప్రభావతిగారు "గరల్స్ హైస్కూళ్ల" ను గురించి వ్రాసిన వ్యాసంలో ఆడపిల్లల అవస్థలను చక్కగ వివరించారు.

గుంటూరు కల్యాణి (అప్పికట్ల)

* * *

వ్యాసములో పేర్కొన్నవి ప్రస్తుత గరల్స్ హైస్కూళ్లలో యున్న వాస్తవిక పద్ధతులు యని వ్రాసినారు. రచయిత్రి పేర్కొన్నట్లు నేడు మధ్య తరగతి కుటుంబీకులకు వాళ్ల పిల్లలను చదివించుట చాలా కష్టముగా యున్నది. అదియునుగాక మా అనుభవములో ట్యూషన్స్ విషయములో మగ పిల్లల హైస్కూళ్లలో గూడ కొన్ని పేర్కొనదగిన విషయములు కొన్ని యున్నవి. ట్యూషన్ల మీద టీచర్లకు ఆసక్తి పెరిగి స్కూళ్లలో చదువు యందు పూర్వమువలె శ్రద్ధ వహించుటలేదు. కొంతమంది టీచర్లకు ట్యూషన్ విద్యార్థులు సుమారు 25, 30 మంది (ఒక్క టీచరు) గూడ గలరు. ట్యూషన్ పెట్టుకొనని విద్యార్థులను బెదిరించేవారు గూడ గలరు. అదియును గాక, స్కూళ్లలో మొదటి ఫారం పీటు సంపాదించుటకు పిల్లల తల్లిదండ్రులకు నేడు కష్టతరమయిన సమస్యగా అయినది.

కూచిభొట్ల సీతామహాలక్ష్మి (రాజమండ్రి)

* * *

'క్లాసంతకు ఒకే రకం బట్ట తెచ్చి యిస్తాము వచ్చే క్లాసుకు 2 రు. తెచ్చి ఇవ్వండి' అన్నట్టి కొన్ని, విషయములను చాల నిర్భయముగా బయటపెట్టి, ఆవిధముగా చేయునట్టి టీచర్ల హృదయములకు



...అందుచేత, నేను కెవ్వున కేక వేశాను

నేను ఏడిచాను, గిల గిల తన్నుకున్నాను,

నా మొహమంతా కందిపోయింది,

నాకు ఆహారము దొరికినంత వరకు·

రుచికరమైన గ్లాక్సో—పిల్లలకొరకు ఆహారము

నాకు ఎప్పుడూ అదంటే ఇష్టము

నాకు ఇప్పుడు కూడ అదంటే ఇష్టము

నిజంగా అది సర్వోత్తమమైనది

నాకు అది తప్ప మరేదీ అక్కరలేదు

దానిలో అమ్మ శ్రద్ధ తీసుకుంటుంది

నేను పట్టు పడతాను !

గ్లాక్సోలో, తల్లిపాలలో వుండే గుణాలన్నీ వున్నాయి...మీ బిడ్డ బలముగాను ఆరోగ్యవంతము గాను పెరుగుటకు కావలసినవన్నీ వున్నాయి. మరియు ఇది ప్రతి చోటా సులభముగా దొరుకుచున్నది.

గ్లాక్సో బేబీ పుస్తకం ఉచిత ప్రతి (తెలుగులో) కోసం 50 న.పై. తపాలా బిళ్లలను (తపాలా ఖర్చుల నిమిత్తం) గ్లాక్సో, వుడ్స్ రోడ్, మద్రాస్-2 ఈ చిరునామాకు పంపండి.




GLY-3-TEL

**Glaxo**

గ్లాక్సో — పశి బిడ్డలకు సంపూర్ణ పాల ఆహారము

మాటి బాణముల వలె విసరినారు. ట్యూషన్లకు పిల్లల ఉత్తీర్ణతకు గల సంబంధమును ఒక్క ముక్కలోనే ముగించినారు ఈ ట్యూషన్ల కొరకై పిల్లలకు మార్కులు తగ్గించి ఉత్తీర్ణత పొందకుండా జేయు జబ్బు ఆడ టీచర్లకే గాక, మొగ టీచర్లకు కూడా చాలా ఎక్కువగా యున్నది. ట్యూషన్లు — పిల్లల ఉత్తీర్ణతను గురించి మరి యొక వ్యాసమును వ్రాసి భావిభారత పౌరులకు తోడ్పడవలెనని కోరుచున్నాను.

(శ్రీమతి కోరా లలితమ్మ (బెంగుళూరు)

* * *

నా చెల్లెలు ఒకమ్మాయి గరల్స్ హైస్కూల్లో చదువుతూంది. ఆ అమ్మాయి పోరు ఇంత అని చెప్పలేము. ఏమంటే, ఈరోజు కుట్టు కోసం అంటుంది. అర్ధ గజం గుడ్డా, ఓ రూపాయి దారాలు తీసుకెళ్తూంది. మరుసటిరోజు అంటుంది, నోట్‌బుక్స్ లేవు అందుకని మమ్మల్ని బయట ఎండలో నిలబెట్టారు. అని బుక్స్ తీసిచ్చేంత వరకూ మా ప్రాణాలు తోడేస్తూంది. ఆ మరుసటిరోజు అంటుంది, జాకెట్టు తీసివ్వండి అని .... మనకు అవసరం లేకపోయినా తీసివ్వక తప్పదు. నా చెల్లెలు నాలుగు సంవత్సరాలనుండీ గరల్స్ హైస్కూల్లో చదువుతూంది. ఇదివరకూ

# వనితావాణి

ఎన్నోవార్లు కుట్లు కోసమని గుడ్డలు తీసుకెళ్లింది. కానీ ఇంతవరకు మేము నా చెల్లెలు కుట్టి తీసుకొచ్చిన గుడ్డ చూళ్లేదు. 'ఏది' అనడిగితే 'టీచర్ (తప్పు మేడమ్) తీసుకొన్నారు' అంటుంది. 'అడిగి తీసుకురా !' అని నేను దబాయిస్తే 'ఎవ్వరూ అడిగి తీసుకోంది నేనేలా అడగను ?' అంటూ ఏడ్పు మొహం పెడుతుంది. ఈలా రాయాలంటే యీ మేడమ్స్ పెట్టే బాధలు చాలా ఉన్నాయి.

పిల్లల్ని, వారి ద్వారా పెద్దల్ని కష్టపెట్టడము ఈ మేడమ్స్‌కు తగదు. కావున ఇకనైనా దయచేసి గరల్స్ హైస్కూళ్లల్లో పనిచేసే మేడమ్స్ విద్యార్థినులను బాధపెట్టకుండా ఉండాలని కోరుచున్నాను.

(శ్రీమతి శిరివేలు రమణాదేవి (మదనపల్లె)

## ఇడ్లీలు - రకాలు

వనితావాణిలో ఇటీవల ప్రచురించిన ఇడ్లీలు అనే వ్యాసం కేవలం దండగ. లేకపోతే ఇడ్లీలు చేయలేని స్త్రీలు ఉంటారా? "వంటలేని అమ్మాయి కూనిరాగాలు తీయలేని అబ్బాయి" ఉండరన్న సామెత వినలేదేమో....రచయిత్రి.

కుమారి ఉమాబాల (విజయవాడ) ★

వంటలు

## గోధుమ రవ్వలడ్డు

కావలసిన వస్తువులు :

| | |
|---|---|
| గోధుమ రవ్వ లేక (పిండి) | $\frac{1}{2}$ ఆళాకు |
| పంచదార | $\frac{1}{2}$ ఆళాకు |
| నెయ్యి | 1 పలం |
| జీడిపప్పు | కాసిని |
| ఏలకులు | ఐదారు |

ఈ గోధుమలను కాస్త ముదరు బంగారు వర్ణానికి వచ్చేలాగా వేయించాలి. వీటిని పిండికొట్టాలి. అందులో ఓ ఆళాకు లేదా అరళాకు పిండిని మెత్తని పంచదార లేదా మామూలు పంచదార పాకంలో (వేయించిన) జీడిపప్పు, ఏలకుపొడి వేయాలి చల్లారేటప్పుడు వీటిని చిన్నచిన్న అంటే నిమ్మకాయలంత సైజులో ఉండలు చేయాలి. ★

# చదువులావు - బి. వి. సత్యామూర్తి










# ఒక చుక్క వాన!



ఆఏడు వానలు లేవు. అందరూ తమపనులు మానేసి ప్రార్థనలు మొదలుపెట్టారు. నేలలో తేమనంతా సూర్యుడు పీల్చేశాడు. మట్టి మనిషి పాదంకింద పగిలినట్లు బీటలు వారింది. బళ్ల చక్రాలవెనక దుమ్ము లేచి, ఆకులమీదపడి చివరికి ఆ ఆకులు ఏ రంగో కూడా తెలియకుండా తయారుచేసేది, నీటి కరువు నేలమీదే కాదు ఎక్కడెక్కడో ఉన్న పల్లాలలోకి, గోతులలోకి పాకివెళ్లి నీరంతా మాయం చేసింది.

వరిచేలు ఒక్కొక్కటిగా ఎండిపోయాయి. వాటిమీద నడిచే పెద్ద దున్నపోతులూ గేదెలూ బురదలో దిగిపోవు, ఇప్పుడు. దాహంతో పిచ్చెక్కిపోయిన జంతువులు ముళ్లతో నిండిన అడవిని వదలి బయటికి రావటం మొదలు పెట్టాయి. మానవుడి 'రాజ్యం' మీద దాడిచేసి, ఓడిపోయి అడవిలోకే పారిపోయాయి. అయినా కొంతకాలానికి అవి వెనక్కి తగ్గటంమాని మనుష్యులతోనే మిగిలిన చిన్న బురద గుంటల కోసం పోట్లాడేవి. రైతుల పిల్లలు పొడితనంలో

## సుప్రసిద్ధ ఆసియా కథలలో రెండవ కథ

# పీటర్ డి. సిల్వార్ (ఇండోనేసియా)

> రాజకీయ వార్తల విషయంలోనే గాక సాహిత్యం విషయంలో కూడా మన పత్రికలు ఆసియా దేశాలను అశ్రద్ధ చేస్తున్నాయనే ఆరోపణ లేకపోలేదు! పాశ్చాత్య సాహిత్యం తెలిసినంతగా మనకి మన ఖండంలోనే వెలువడిన, వెలువడుతున్న సాహిత్యం గురించి తెలియదు. ఈ లోటును కొంత వరకు తీర్చేందుకే సుప్రసిద్ధ ఆసియా రచయితల కథలు కొన్ని వరుసగా ప్రచురించ దలచాము. ఇండోనేసియాకు చెందిన యీ కథ యీ శీర్షికలో కలో రెండవది. ఒక్కొక్క వారం ఒక్కొక్క దేశానికి సంబంధించిన కథ ప్రచురిస్తాము.

చిక్కుకుని చురుకుతనంతో బాటు ఓపిక కూడా పోగొట్టుకున్నారు. ధారాళంగా చెమట ఆరిపోయింది. పిల్లలు నీడలో ఆయాసపడిపోతూ ఉంటే వారి తల్లులు బాధపడే కళ్లతో చూస్తూ ఉండి పోయారు.

అతను బరువుగా లేచి, గుడిసె వదలి బయటికి వెళ్లాడు. తన వరిపొలాలలోకెల్లా పెద్దదానికి వెళ్లాడు. ఎండిపోయి, బీటలువారిన మట్టిమీద నడిచి వెళ్లాడు. పొలం మధ్య ఒక చిన్న గుట్ట వంటిది ఉంది. అతను దీనిమీదకి ఎక్కి కళ్లకి చెయ్యి అడ్డం పెట్టుకున్నాడు— మబ్బులేని ఆకాశంలో, పైన పయనం చేస్తున్న సూర్యుడి తీక్ష్ణమయిన వెలుతురు పడకుండా, తన తండ్రి కాలంలో, అతనికి ముందు అతని తండ్రి కాలంలో అంతకన్నా ముందు తండ్రి తండ్రి కాలంలో వాన లేచివచ్చిన నైరృతి వంక చూశాడు. అలిసిపోయిన ఆలోచనతో గతాన్ని స్మరించాడు. ఇటువంటి కరువు కాలం ఎప్పుడూ రాలేదు. గుట్టదిగి పొలంలోకి వచ్చాడు. కర్రతో ఒక బెడ్డపెరికి వేళ్లతో పొడిచేశాడు. దుమ్ముగా మారి వేడి నేలమీదకి జారిపోయింది. నెమ్మదిగా గుడిసెకి తిరిగి వెళ్లిపోయాడు.

ఆమె అతన్ని చూసి ఎదురుగా వెళ్లింది.

"వానకోసం ఎదురుచూడక," అంది. "ఎలా జరగాలో అలా జరగనీ. అలా అనుకుంటే తేలిగ్గా ఉంటుంది."

అతను పైకి తిప్పిన ఆమె మోహంలోకి చూశాడు. కళ్ల చుట్టూ అప్పుడప్పుడే వస్తున్న చిన్న గీతలని చూశాడు. తన స్త్రీ... కాని గొడ్రాలు. పది సంవత్సరాలుగా ప్రార్థించారు. వేచుకుని చూశారు. ప్రార్థించారు. కాని బిడ్డ కలగలేదు.

"కుప్పచేసిన తర్వాతేమిటి ? మనకి సాయం చేసే వారెవరు?" అన్నాడు.

"నాకూ తెలీదు," అంది ఆమె మెత్తగా, "పిల్లలులేని ఆడదానికి స్నేహితులు లేకపోయినా కొరత అనిపించదు. ఏదో ఒకటి చేద్దాం ! మనకి ఆకలి కొత్తకాదు."

గుడిసె చేరుకుని చిన్న బల్లమీద కూర్చున్నారు. అది వాడి వాడి ససుపుదేరింది. ఆకాశంలో సూర్యుడు ఇంకా పైకి ఎక్కాడు. చిన్నగాలి వీచి దుమ్ము లేచింది. అతను నిద్రపోయాడు. తన పెళ్లి రోజు కలలోకి వచ్చింది. ఇదే గ్రామంలో జరిగింది. తన స్నేహితులు చుట్టూ చేరి అరిచారు. వేళాకోళం చేశారు. తన కళ్లంతా ఈ అమ్మాయి మీదే. పెళ్లికి వచ్చినవారి తలల మీద వారి చూపులు కలిశాయి. సంతోషం వేసింది. ఇద్దరంటేనూ ఊరిలో వారందరికీ అభిమానమే. వాళ్ల పొలాలు ఆ చుట్టుపక్కల వాటన్నిటిలోనూ మంచివి. ముందు రాబోయే కాలం మంచిది....

అతను కలలు కంటూ ఉంటే ఆమె తామిద్దరూ కలిసి ఉన్న ఏళ్లన్నిటినీ గుర్తుకి తెచ్చుకుంది. మొదటి సంవత్సరం గడిచినా బిడ్డలేక పోవటంతో తన తల్లి కొంచెం కలవరపడ్డది. మూడవ ఏడు స్నేహితులు కూడా తమ ఎదురుగా కొంచెం కలవరం చూపేవారు. పొలాల చివరే ఉన్న ఆ గుడిసె వైపు రావటం మానేశారు. సజీవంగాక కళ కళలాడుతున్న ఈ గడ్డలో గొడ్డుపోవడం ఏమిటి ? ఇప్పుడు ఒకరికొకరు వారిద్దరే మిగిలారు. ప్రతి దినమూ తమ పనులు యాంత్రికంగా చేసుకుంటూ వెళ్లారు. ఎప్పుడయినా కొన్ని కలలు కన్నారేమో, ఒక బిడ్డకోసం. కాని ఈ కలలో మునిగిపోలేదు ఎవరూ. ఈ మధ్యనే కొంచెం భారం అనిపిస్తోంది. రాత్రి దానిని గురించి ఆలోచించింది. కాని బయటికి చెప్పలేదు. సూర్యుడు దిగటం మొదలు పెట్టాడు. సముద్రంలోకి జారి పడిపోతున్నాడు. నీడలు పైకిలేచి గుడిసెని ఆవరించాయి. తర్వాత దాటిపోయాయి. పక్షులు తమ గూళ్ల చేరుకుంటున్నాయి. సంధ్య వెలుగులో పొదలు ఎర్రగా మెరిశాయి. ఒక క్షణం స్పష్టంగా కనిపించినవన్నీ మరుక్షణం చీకటిలో కలిసిపోయాయి.

అతనూ, ఆమె, ఇద్దరూ మాట్లాడకుండా కూర్చున్నారు. క్రమంగా నక్షత్రాలు వెలిశాయి. వాటి వెలుగు గుడిసెను చేరింది. ఆమె లేచి లోపలికి వెళ్లి, కొంచెం అన్నం, ఎండిన చేపలూ తీసుకు వచ్చింది. అతను వళ్లు విరుచుకున్నాడు. గొంతు సవరించుకుని సావిట్లోకి ఉమ్మివేశాడు. ఎంగిలి దుమ్ముతో ముద్దకట్టి కొంచెం దొర్లి నేలలోకి ఇంకిపోయింది. తిండి తిని బయటికి వెళ్లారు. రాత్రి ఆమె ఉలిక్కిపడి లేచింది. బాధ లేదు. అదే సంచలనం. ఒక క్షణం అర్థంకాక కలవరపాటుతో కదలకుండా పడుకుంది. ఏదో చైతన్యం ఆమె భావ పరంపరలో వెలిసింది. చీకటిలో చెయ్యిచాపి అతని భుజం పట్టుకుంది.

అతను ఆమెవైపు తిరిగాడు. ఆమెకళ్లు మెరుస్తున్నాయి. కళ్ల నీళ్లమధ్య చెప్పింది రహస్యంగా : "నాకే తెలుస్తోంది. నాలో ప్రాణం ఒకటి ఉంది!"

ఆమెని తన చేతుల్లోకి తీసుకుంటూ ఉండగా ఇంటి కప్పుమీద అమాంతంగా వాన చుక్కలు రాలటం మొదలుపెట్టాయి.



రోజంతా సొగసుగా కనపడుటకు
జనుల అభిమాన నటుడు
సుదేశ్ కుమార్
వేసలీన్
హెయిర్
క్రీమ్
తలకు రాసుకొనును!






మీరు ఫిల్మ్ స్టారులా హాయిగా, సొగసుగా కనపడగలరు!
వేసలిన్ హెయిర్ క్రీమ్ రాసుకొని సుదేశ్ కుమార్ వలె సొగసుగా, కనపడండి! అది తేమ కలిగినది, విటమిన్లు చేర్చబడినది.
మీ శిరస్సును అది చల్లగా, ఆరోగ్యవంతముగా ఉంచుతుంది!

వేసలిన్ హెయిర్ క్రీమ్ — సినిమా స్టార్లు వాడే
కేశ శృంగార సాధనము!

జనుల అభిమాన నటుడు సుదేశ్ కుమార్ జెమినీవారి 'గృహస్థి' చిత్రములో నటించేడు.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

డా॥ గాలి బాలసుందరరావు

# మనమూ-మనదేహస్థితి

## పైలోరస్ - ఆటంకములు

జఠరాశయము, డువోడినముతో కలిసే ప్రదేశమును పైలోరస్ అంటారని యిదివరకే తెలుసుకున్నాము. పైలోరస్ అంటే ద్వారపాలకుడు. పైలోరస్‌కూ, డువోడినమునకు మధ్య ఒక స్ఫింక్టరు ఉన్నది. దీనిని పైలోరిక్ స్ఫింక్టరు అంటారు. ఈ స్ఫింక్టరులో ఉండే కండరములు సంకోచించినప్పుడు దాని ద్వారము సన్నగిల్లడమో, మూసుకుపోడమో, సంకోచ ప్రమాణమును బట్టి జరుగుతుంది. ఇది దాని ధర్మమును అది మితిమీరి నిర్వహించినందువలన ఏర్పడిన ఆటంకము. ఈవిధంగా ధర్మ సంబంధమైన రోగ స్థితులను ధార్మిక రోగములు (Functional Diseases) అంటారు.

కాని, కొన్ని రోగ స్థితులలో పైలోరస్ ద్వారము. కొద్దిగానో, పూర్తిగానో అందులో ఏర్పడిన రోగములవల్ల మూసుకుపోవడం తటస్థిస్తుంది. ఇది ఆంగికంగా దానిలో ఏర్పడిన మార్పుల వల్ల ఏర్పడిన రోగ పరిస్థితి. ఇది ఆంగిక రోగము (Organic Disease).

సాధారణంగా పైలోరస్‌లో ఆటంకమును కలిగించే రోగములలో అతి ముఖ్యమైనవి. ఆ ప్రదేశంలో ఏర్పడే అల్సరులు, పైలోరస్ చివర భాగంలోనూ డువోడినం మొదటి భాగంలోనూ కూడా అల్సర్లు ఏర్పడవచ్చును. అల్సర్లు చాలా కాలంగా అంతకంతకు పెద్దవై మాననప్పుడు అల్సరువల్ల నశించిన సహజ ధాతు స్థానంలో అనుబంధ ధాతువు ఏర్పడుతుంది. ఆ అనుబంధ ధాతువుకు (Connective Tissue) అంతకంతకు ముల కరచుకొనిపోయినప్పుడు జఠరాశయం రూపే మారిపోతుంది. పైలోరస్ ద్వారం కొద్దిగానో, గొప్పగానో మూడిపోతుంది.

జఠరాశయంలో ఏర్పడిన కేన్సరు అంతకంతకు పెరిగి, పైలోరస్ ప్రదేశంలోకి పాకి, అది దుర్మాంసవృద్ధివలన దాని ద్వారమును మూసివేయవచ్చును.

జఠరాశయంలో ఏర్పడిన దీర్ఘస్థితి (Chronic State) _ అందుకున్న ఇన్‌ఫ్లమేషనువల్ల ఈ స్థితిని క్రానిక్ గేస్ట్రైటిస్ (Chronic Gastritis) అంటారు — నూతనంగా అనుబంధ ధాతువు ఏర్పడి, పైలోరస్‌లోకి పాకి, దానిలో ఉండే మ్యూకస్ పొర, దానికీ, కండరములకూ మధ్య ఉండే పొర (Submucous Coat) మందమై పైలోరస్ ద్వారము మూసుకుపోతూ ఉంటుంది.

దీర్ఘకాలంగా ఉండే ఇరిటేంటులవల్ల పైలోరస్ స్ఫింక్టరులో నూతన మాంసవృద్ధి జరిగి, అది చాలా పెద్ద దవుతుంది. ఇల్లా నూతన మాంస వృద్ధి జరగడానికి కారణం ఆ స్ఫింక్టరులో ఉండే కండరములు అతిగా వృద్ధి పొందడమే. ఈ విధంగా ఒకే రకమైన ధాతువులో జీవకణములు అతిగా వృద్ధిచెంది ఆ భాగం పెద్దది కావడమును హైపర్ ప్లేసియా (Hyperplasia) అంటారు. ఈ పరిస్థితి చిన్నపిల్లలో తరచు ఏర్పడి, పైలోరస్ ద్వార నిరోధం తటస్థిస్తూ ఉంటుంది.

ఉదరకుహరంలో ఉండే ఉపాంగములలో క్రిమి దోషం ఏర్పడ్డప్పుడు, వాటిమధ్య త్రాళ్లవంటి నిర్మితాలు ఏర్పడి, వాటి చలనమును అరికట్టుతవి. ఈ నూతన నిర్మితాలను 'ఎడ్హీషన్సు' (Adhesions) అంటారు. ఇవి అనుబంధధాతు విశేషములతో తయారవుతవి. ఒకమాటు ఈ ఎడ్హీషన్సు ఏర్పడితే అవి అంతకంతకు కుంచించుకుని వాటిని అంటివున్న ఉపాంగములు, స్థానం తప్పుతవి. అవి నాళములవంటి నిర్మితాలయితే, రబ్బరు గొట్టం మెలిపెట్టినప్పుడు దాని ద్వారం మూసుకు పోయినట్లుగా ఆ నాళ ద్వారములు మూసుకుపోతవి. ఈ నాళముల గోడ పలుచనిదైతే అది త్వరగా, తేలికగా, కొద్దిపాటి గుంజుడుతోనే మెలిపడిపోతుంది. కాని, పైలోరస్ గోడ చాలా మందమైంది. బలిష్ఠమైంది. ఉదర కుహరంలో దూరంగా ఉన్న ఉపాంగములు క్రిమిగ్రస్తములైనప్పుడు ఏర్పడే ఎడ్హీషన్సువల్ల పైలోరస్ మెలిపడి దాని ద్వారం మూసుకుపోదు. కాని పిత్తరసం నిలవ ఉండే పిత్తాశయము (Gall Bladder) దీనికి అతి సమీపంలో ఉన్నందున, ఆ ఉపాంగములో క్రిమి ఫలితంగా ఏర్పడే ఎడ్హీషనుల గుంజుడువల్ల పైలోరస్ మెలిక పీకడం సాధ్యం.

జఠరాశయంలో అల్సరులు సాధారణంగా దీర్ఘ స్థితిలోనే ఉంటవి. కాని, అజీర్ణ పదార్థములు తిన్నప్పుడు జఠరాశయమే ఇన్‌ఫ్లేం అయినప్పుడు ఆ అల్సరు చుట్టూ ఉండే ధాతువులు ఉబ్బిపోతవి. అల్సరు పైలోరిక్ స్ఫింక్టరుకు సమీపంలో ఉంటే దాని ద్వారం మూసుకుపోయే అవకాశం ఉన్నది. బాధ ఏర్పడగానే దుస్సంకోచం (Spasm) విధిగా ఏర్పడుతుంది. పైలోరస్ మ్యూకస్ పొర ఉబ్బి సగం మూసుకుపోయిన పైలోరిక్ స్ఫింక్టర్ ద్వారంలో దుస్సంకోచం కూడా ఏర్పడిందంటే ఆ ద్వారం పూర్తిగానే మూసుకుపోయి, ఆహారం జఠరాశయంలోనుంచి డువోడినం పోవడానికే వీలుండదు.

పైలోరస్ ద్వారంలో ఆటంకం ఏర్పడగానే ఆహారగతికి నిరోధం కలుగుతుంది. ఈ రోగ పరిస్థితిలో ఏర్పడే లక్షణములు ఎంత నిరోధం కలిగింది అన్న విషయంమీద ఆధారపడి ఉంటవి.

ఆహార గతికి పైలోరస్ వద్ద నిరోధం ఏర్పడగానే బలవంతంగా ఆ ఆహారాన్ని డువోడినంలోకి పంపడానికి జఠరాశయంలో బలవత్తరమైన సంకోచం ఏర్పడుతుంది. ఆ సమయంలో నిర్లక్ష్యం చేయరానంత బాధే కలుగుతుంది. ఆహారం యిచ్చిన కొంచెం సేపటికి పిల్లలు గుక్కపట్టి ఏడుస్తారు. ఆహారం ప్రేగులలోకి పోంగానే ఈ నెప్పి తగ్గిపోతుంది. కాస్త ఆహారం కడుపులోకి పోగానే కడుపు నిండినట్లే. కడుపూ రాయిలా తోస్తుంది. అప్పుడు రోగి కొంచెం కొంచెం ఆహారమే తీసుకొంటాడు. అందువల్ల తరుచు ఆకలివేస్తూ ఉంటుంది. మొండికేసి బలవంతంగా మామూలుగా తీసుకొనే ఆహారం తీసుకుంటే అది పైలోరస్ దాటి డువోడినంలోకి పోయేదాకా పోర్లు పోర్లుగా కడుపులో నొప్పి వస్తూనే ఉంటుంది. ఈ నొప్పి ప్రక్క ఎముకలకు క్రింద నాభికి పైన ఉన్న ప్రదేశంలో అధికంగా ఉంటుంది. కొంతకాలానికి పైలోరస్‌లో ఆటంకం పూర్ణమై జఠరాశయం సాగిపోతుంది. అప్పుడు ఆహారంతో జఠరాశయం నిండి కడుపు ఉబ్బరంగా ఉంటుంది. ఈ ఆహార పరిమాణ ఒక స్థితిని దాటగానే వాంతి ఏర్పడుతుంది. జఠరాశయంలో ఆహారం జీర్ణం కాగానే ముందున్న డువోడినంలోకైనా పోవాలి లేదా, ఈసొఫేగస్‌కూ జఠరాశయానికీ మధ్య ఉన్న కార్డియల్ స్ఫింక్టరు ద్వారా వాంతిగా బయటి కయినా పోవాలి. వేరే మార్గాంతరం లేదు. ప్రారంభ దశలో ఈ వాంతి సాధారణంగా సాయంకాలం జరుగుతూ ఉంటుంది. కాని, ఆటంకం అధికమైనకొద్దీ జఠరాశయం అధికంగా సాగి, తగినంతగా తరంగ చలనం ఉండదు. జఠరరసోత్పత్తి తగ్గిపోతుంది. ఆహారం పూర్తిగా జీర్ణంకాక, వాయువులు అధికంగా ఉత్పత్తి అయి జఠరాశయం ఇంకా ఉబ్బుతుంది. ఈ దశలో సాయంత్రం ఆరంభమైన వాంతి అనేక తడవలుగా జఠరాశయంలో ఉన్న అజీర్ణ పదార్థం అంతా బయటికి వచ్చేవరకూ జరుగుతూనే ఉంటుంది. ఈ వాంతి సాధారణంగా చిమటాలో మంచి కొట్టిన నీరులాగా ధారగట్టి దూరంగా పడుతుంది. ఇది పైలోరస్‌లో ఆటంకం ఏర్పడినపుడు సంభవించే ప్రధాన సంఘటన. కోపము, దుఃఖము, జుగుప్స వంటి మానసిక పరిస్థితులవల్ల పైలోరిక్ స్ఫింక్టర్ నైతికంగా దుస్సంకోచమును పొంది మూసుకుపోయినప్పుడు జఠరాశయంలో కండరములు బలంగా ఉన్నప్పుడు వాంతి మరీ దూరంగా పోయి పడుతుంది. కాని, జఠరాశయం సాగిన తరువాత సంభవించే వాంతి ఎక్కువ దూరం పోదు. కాని, మామూలుగానూ అవదు. ఆ వాంతిలో రెండు మూడు రోజుల క్రింద తిన్న ఆహార పదార్థములు కూడా ఉంటవి. దీర్ఘకాలం ఉండే ఈ యిరిటేషనువల్ల జఠరాశయంలో కేన్సరు ఏర్పడవచ్చును. అటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు వాంతి అయిన పదార్థం పులిసినందున పుల్లగా ఉంటుంది. కాని, అది దుర్గంధభూయిష్టమై ఉండదు. కేన్సరు ఏర్పడితే వాంతి అయిన పదార్థము దుర్గంధభూయిష్ఠంగా ఉంటుంది. పులిసిన ఆహారంలో ఉండే, లన్న

44 వ పేజీ చూడండి



# 'ఒకనాటి చిలిపిపని'

ఆశ్రీ రామారావు

నేను చదువుకునే రోజుల నుంచీ నాలో ఒక కోర్కె ఉండేది. ఆకోర్కె నాలో—ఎప్పుడు, ఎలా కలిగిందో నా కిప్పుడు గుర్తులేదు. ఆ కోర్కె ఏమిటో చెప్పనా ? వింటే నవ్వుతారేమో .... నా కెప్పుడూ తెలియని ఒక అతి చిన్న రైలు స్టేషన్లో, చీకటిలో, ఒంటరిగా, ప్లాట్‌ఫారం అనబడే మట్టి రోడ్డుమీద అటూ ఇటూ పచార్లు చేస్తూ, సిగరెట్టు కాలుస్తూ, రైలుకోసం ఎదురు చూస్తూ గడపాలని. నాలో ఇంతకాలంగా ఉంటూ వచ్చిన ఈ కోర్కె తీరే అవకాశం ఇన్నాళ్ళుగా లభించలేదు. ఇవాళ నా కోర్కె మా చెల్లాయి పెళ్లి సమ్మంధం ద్వారా తీరింది. ఆ తీరటం రైలుకోసం అలా ఎదురుచూడటంలోని ఆనందం— మొదటి అరగంటలోనే తీరాయి. ఆ తర్వాత విసుగు పుట్టుకు వచ్చింది. నామీద నాకే చిరాకేసింది. ఛీ ఛీ, ఇలాటి కోర్కె కోరుకున్నా నెందుకా అనిపించింది.

ఆ పల్లెటూరిలో బి. కాం. చదివిన కుర్రవాడున్నాడంటే మా చెల్లాయికి పెళ్లి సమ్మంధం చూడటాని కెళ్లాను. కుర్రవాడు బాగానే ఉన్నాడు. నాకు నచ్చాడు. నాకు నచ్చనిదల్లా కుర్రవాడి తండ్రే ! ఆయన తీరే ! ఆయన పదివేలు కట్నం కావాలని కొండనెక్కి కూర్చున్నాడు. అంతపైకి నేను ఎక్కలేక, ఆయన్ని కిందకి దింపలేక, ఈ సమ్మంధానికి కూడ నీళ్లు వదులుకొని, ఉసూరుమంటూ ఆ వూరికి, ఈ స్టేషనుకు మధ్యనున్న నాలుగున్నర మైళ్ల దూరాన్ని నడిచి వచ్చేసరికి చీకటి పడింది. రావల్సిన బండి రెండున్నర గంటలు లేటన్నమాట వినగానే ఇందాక చెప్పానే, ఆ పిచ్చి కోర్కె నాలో బలంగా కదిలింది. ఉల్లాసంగా సిగరెట్టు వెలిగించి పచార్లు చెయ్యటం మొదలు పెట్టాను. అరగంట గడిచేసరికి నా కోర్కె తీరటం, విసువు, చిరాకు పుట్టటం జరిగింది. దీనికి తోడు ఒక వ్యక్తి ఒంటినిండా శాలువ కప్పుకుని వసారాలో ఉన్న బెంచీమీద తీరిగ్గా కూర్చుని, ఖంగు ఖంగున దగ్గుతున్నాడు. ఎడతెరపిలేకుండా. నా కసహ్యం వేసింది.

సిగరెట్లు కాల్చి కాల్చి నా గొంతుకెండిపోయింది. మంచినీళ్లు తాగాలనిపించింది. వసారాలోని కెళ్లాను. కూజాలోని చల్లటి మంచినీళ్లు రెండు గ్లాసులు తాగాను. బెంచీమీద కూర్చున్న వ్యక్తి నీరసంగా నన్ను పిల్చాడు. తనకు కూడ మంచినీళ్లు ఇవ్వమనడు కదా, అనుకున్నా. తన దగ్గుతోనే కాకుండా మాటలతో కూడ చంప దల్చుకున్నాడా ? విసుగ్గా దగ్గర కెళ్లాను.

'ఏరా రాము. నన్ను గుర్తుపట్టలేదా?' అన్నాడు. ప్రక్కన కూర్చోమన్నట్లుగా ఒక వయిపుకు జరుగుతూ.

నా ఆశ్చర్యానికి అంతులేదు. ఇతనికి నా పేరు

ఏట్నా తెలిసింది. వేయిగా గుర్తు పట్టలేదా అంటున్నాడు. ఎవరితను? చిక్కి శల్యమైవున్న అతడ్ని చూస్తుంటే నాకు తెలిసిన వాళ్ళ ఎవరూ గుర్తుకు రావటంలేదు. అతనిమీద వారగ పడుతున్న స్టేషను దీపం కాంతిలో అతన్ని నిదానంగా చూస్తూ, నా జ్ఞాపకాలను త్రవ్వుకున్నా. అతని కళ్ళు తళతళ మెరుస్తున్నాయి. ఆ కళ్ళను ఎక్కడో చూచిన గుర్తు. ఆ కళ్ళు........అవును.......ఆ కళ్ళు మా మధువే!

'నీవురా, మధూ!' అంటూ ప్రక్కన కూర్చున్నాను.

ఇందాక ఏ వ్యక్తినయితే చూచి విసుక్కుని చిరాకు పడ్డానో, ఆ వ్యక్తి నా ప్రాణ స్నేహితుడు మధు!

'చీకట్లో నన్నెలా పోల్చుకో గలిగావురా, మధు?' అని అడిగాను.

మధు, 'నీవు పచార్లు చేస్తుంటే చూశాను. నీ నడక నాకు గుర్తేగా. నీవు వేయి మందిలో ఎక్కడ ఉన్నా నీ నడకనుబట్టి నిన్ను పోల్చుకో గలమురా. నీ ఎగుడు దిగుడుల నడకను మర్చిపోతామురా' నవ్వుతూ అన్నాడు.

నేనూ నవ్వాను. నా కెంతో ఆనందంగా ఉంది. ఎన్నో సంవత్సరాల తర్వాత నా మిత్రుడ్ని కలుసుకున్నందుకు. అందులోనూ—ఈ చీకటి రాత్రి, ఈ స్టేషన్లో, ఒంటరితనాన్ని భరింపజాలని స్థితిలో ఉండగా పాత స్నేహితుడు కలవటం చాల సంతోషదాయకమైన విషయం. కాని వాడి దగ్గు, వాడి ఆకారం నాకు విచారాన్ని కలిగించింది.

'ఇదేంటిరా, మధు! ఇలా అయిపోయా వేమిటి? ఈ దగ్గేమిటి?' దగ్గరికి జరిగి భుజంమీద చేయి వేస్తూ ఆప్యాయతగా అడిగాను.

దానికి నవ్వి, వాడు చెప్పిన సమాధానం ఇది!

'టి. బి. రా బ్రదర్. ఒక లంగ్ దాదాపు చెడిపోయింది.'

టి. బి.—ఎంత భయంకర వ్యాధి! ఒక లంగ్ చెడిపోయింది—ఎంత దారుణ స్థితి! చాల కాలం తర్వాత అనుకోకుండా కలిశాం అని ఆనందంతో ఇదవుతుంటే వాడు చెప్పిన వార్త ఇది!

పది సంవత్సరాల క్రితం మేమంతా రూంమేట్సుగా ఉన్నప్పుడున్న మధుకు, ఇప్పటి మధుకు పోలిక ఎక్కడ? ఆ రోజుల్లో వీడు ఉక్కు ముక్కలాగా ఉండేవాడు. అప్పట్లో, గేమ్సుల్లో వీడు మా కాలేజి ఛాంపియన్. ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ ఉషారుగా ఉండేవాడు. మేం రూంమేట్సుగా ఉన్న నాల్గు సంవత్సరాలల్లో రోగంతో ఎప్పుడూ మంచాన పడుకుని ఎరుగడు. ఆఖరికి వీడికి తలనొప్పి కూడ వచ్చేదికాదు. అంత ఆరోగ్యంగా, ఉషారుగా ఉండే మా మధుకా ఈ భయంకర వ్యాధి! ఎవరికైనా ఏదయినా కష్టమొస్తే చూస్తూ వూరుకునేవాడుకాదు. ఆదుకొని చేతనయిన సహాయం చేసేవాడు. పరిక్షల్లో ఒకసారి నాకు జ్వర మొస్తే, నా కెన్ని ఉపచారాలు చేశాడు! ఆ నాలుగు రోజులూ చదువు కూడా మానేసి నన్ను కనిపెట్టుకుని నా ప్రక్కనే కూర్చున్నాడు. మధులాటి జాలి హృదయుడ్ని విధి ఎంత క్రూరంగా హింసిస్తుంది! వీడేం చేశాడని భగవంతుడు వీడికిలాటి కఠిన శిక్ష విధించాడు!

నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నా కన్నీళ్ళు మా వాడు చూడకుండా ఉండాలని ప్రయత్నించా. కాని వాడు కనిపెట్టేశాడు.

ప్రేమగా ఒకచేయి నా భుజంమీదవేసి, రెండో చేత్తో నా కన్నీరు తుడుస్తూ, 'ఛా, అదేంటిరా! కళ్ళ నీళ్ళు పెట్టుకుంటున్నా వెందుకు? ఈరోగం నన్నేం చేస్తుందిరా?' అన్నాడు.

మాటల్లోపెట్టి నన్ను మరిపించాలని. 'నీకు పెళ్ళయిందా? పిల్ల లెంతమంది? ఏ ఉద్యోగం చేస్తున్నావు? జీతమెంత? మీ అమ్మగారు బాగున్నారా? మన ప్రసాదెక్కడ ఉన్నాడు? ఏం చేస్తున్నాడు?'.......ఇలా ఎన్నో ప్రశ్నలు అడిగి, సమాధానాలు చెప్పించుకున్నాడు.

మళ్లీ వాడికి దగ్గు తెర వచ్చింది. అయిదు నిమిషాలసేపు ఎడతెరపి లేకుండా దగ్గాడు. దగ్గు తగ్గిన తర్వాత ఆయాసం తీర్చుకుంటూ అడిగాడు: అవునురా, రామూ! మన పనిమనిషి లచ్చిమి ఇప్పుడెక్కడ ఉందిరా? ఆ రోజుల్లో దాని మొగుడు దాన్ని చావకొట్టుతుండేవాడు కదూ?'

అబ్బ! వీడి కెంత గుర్తు! ఆఖరికి పనిమనిషి పేరుతో సహా గుర్తుంది. అవును మా పనిమనిషి లచ్చిమికి, దాని మొగుడుకు పడేదికాదు. దాన్ని ఎప్పుడూ కొట్టుతుండేవాడు. అది ఏడుస్తూవచ్చి మా, మధుకు చెప్పుకునేది. వీడు దాని మొగుడ్ని పిలిపించి వాళ్ళిద్దరి తగవునూ ఓపిగ్గా విని, సర్ది చెప్పి పంపించేవాడు. ఇదీ వీడి పని!

లచ్చిమిని, దాని మొగుడు త్రాగి కత్తితో పొడిచి చంపి, జైలు కెళ్ళిన సంగతి వీడికి తెలియదా! అవును. తెలియదు. అప్పుడు వీడు లేడు. ఏమయ్యాడబ్బా! ...... అవునవును గుర్తొచ్చింది.........ఫోర్తియర్ చివర్లో మధు ఎవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. అప్పుడు మేమంతా వీడికోసం వెదికాం. వీడింటికి ఉత్తరాలు రాశాం. వాళ్ళ నాన్న, అమ్మ వాళ్ళు వచ్చి ఏడ్చారు పేపర్లో కూడా వేయించాం. ఆ తర్వాత మళ్లీ వీడు నాకు కనిపించలేదు. ఈనాటికీ స్థితిలో కనిపించాడు. ఇన్ని సంవత్సరాలుగా వీడి సంగతే మర్చిపోయాం. అప్పుడలా ఎందుకెళ్ళాడో మా కెవరికీ తెలియదు. ఇంతకాలం వీ డెక్కడ ఉన్నాడో ఏం జేశాడో, ఎందుకిలా అయినాడో?

ఈ సంగతులన్నీ ఇప్పుడు మధును అడిగాను. నేనా పాత సంగతులన్నీ ఎత్తగానే, అసలే కళా విహీనమైన మా వాడి మొగం నల్లగా మాడిపోయింది. వాడి కళ్ళల్లో ఏవో భయంకర జ్ఞాపకాలు కదుల్లాడడం మొదలు పెట్టాయి. బలవతంగా చిరునవ్వు తెచ్చుకుని ఇలా అన్నాడు.

'ఏంలేదురా. సరదాగా ఏంతోచక వెళ్ళిపోయాను మీరు పేపర్లో వేయించిన ప్రకటన కూడ చూచాను. కాని తిరిగి రాబుద్ధి కాలేదు. దేశమంతా ఈ చివర్నుండి ఆ చివర వరకు తిరిగాను. ఆ తిరుగుడుతోనే ఈ జబ్బు పట్టుకుంది. చేతిలో డబ్బు కూడా అయిపోయింది. రెండేళ్ళక్రితం ఇంటికి తిరిగి వచ్చాను. నా దిగులుతో అమ్మ అప్పటికే చనిపోయింది. నాన్న నిరుడు పోయాడు. ప్రస్తుతం నేను ఇంటివద్దే ఉంటున్నాను. డాక్టర్లు మదనపల్లి పొమ్మంటున్నారు. చేతిలో డబ్బు లేదు. మాకీ ఊళ్లో భూములున్నాయి. రైతులు సరిగ్గా డబ్బు ఇవ్వటంలేదు. డబ్బు వసూలు చేసుకుపోదామని వచ్చాను. ఏదో కొంత వసూలు అయిందనుకో. ఇంటికెళ్ళి, అట్నుంచి మదనపల్లికి వెళ్ళతాను.'

సరదాగా, ఏం తోచక దేశాలు పట్టిపోతానంటే ఎలా నమ్మాలి? ఏదో ఉంది. మధు దాస్తున్నాడు. అసలయిన కారణం వాడు చెప్పుతే వినవల్సిందే! నేను అడిగినా చెప్పడు.

ఇంతలో స్టేషను గంట మ్రోగింది.

'ఏ బండి రాబోతుందో, కాస్త వెళ్ళి కనుక్కోరా రామూ!' అన్నాడు.

వెళ్ళి కనుక్కున్నాను. నేను వెళ్ళవల్సిన బండి కాదు. మధు ఊరివయిపు వెళ్ళే బండి వస్తుంది. వచ్చి చెప్పాను. టిక్కెట్టు తెచ్చిపెట్టమన్నాడు. తెచ్చిపెట్టాను. లేచి నిల్చున్నాడు. ఇంకా కొద్ది నిమిషాలల్లో వాడి ట్రైను రాబోతుంది. ట్రైను రాగానే మధు వెళ్ళిపోతాడు. మళ్లీ ఈ జీవితంలో కనిపిస్తాడో, కనిపించడో? నాల్గు సంవత్సరాలు సొంతన్నదమ్ముల్లాగా గడిపాం. పది సంవత్సరాల తర్వాత అనుకోకుండా కలిశాం. మధు భయంకరమైన వ్యాధితో బాధపడుతున్నాడు. దీన్ని చూస్తుంటే ఇంక ఎన్నాళ్లో బ్రతకడనిపిస్తుంది. నాకు కడుపులో దేవినట్లయింది. ఏడ్పు ముంచుకొస్తుంది. వణుకుతున్న చేతితో వాడి చేయి గట్టిగా పట్టుకున్నాను. వాడు దిగులుగా నా మొగంలోకి చూశాడు

మూడోగంట కూడమ్రోగింది. రెక్కవాలింది

'ఏం రా మధు, నీవు పెళ్ళి చేసుకోలేదురా?

మధు మొగం మళ్లీ నల్లగా మాడిపోయింది వాడి గుండెల్లో మంటలు రేగుతుంటె, ఆ మంట తాలుకూ వెలుగు, వాడి కళ్ళల్లో ప్రతిబింబిస్తున్నట్లుగా వాడి కళ్లు ధగధగ లాడినాయి. క్రింది పెదవిని గట్టిగా కొరుకుతూ, చీకటిలోకి చూస్తూ ఇలా అన్నాడు:

'అలాటి పిచ్చిపని చేయదల్చలేదురా. ఆడదానిని నమ్మట మంత బుద్ధి తక్కువ పని ఇంకొకటి లేదని నా స్వానుభవంమీద తెలుసుకున్నాను. నే నీ నాడిలా అయిపోవటానికి కారణ మెవరో తెలుసా ఒక పదహారు సంవత్సరాల పిల్ల. ఆ పిల్ల నన్ను దగాజేసింది. నా జీవితంతో ఆటలు ఆడుకుంది ఈ జీవితంలో మర్చిపోలేని గట్టి దెబ్బ కొట్టింది-' చెప్పుకుపోతున్నాడు

మా మధు ఇలా అవటానికి పదహారు సంవత్సరాల పిల్లా కారణం? మా వాడ్ని ఇలా చేసిందం

42 వ పేజీ చూడం

ఒక చిన్న అమ్మాయి చేతికి రెండు పది నయాపైసలు ఇచ్చి పంపింది వాళ్ళమ్మ, ఒకటి దేవుడి గుడిలో వేసి రెండోదానితో ఏదయినా కొనుక్కు తినమంది. దారిలో ఒకనాణెం సైడుకాలువ లోకి దొర్లింది.

"అయ్యో దేవుడి డబ్బు పోయిందే!" అంది చిన్న అమ్మాయి.

కె. వి. ఎస్. (చీరాల)

## గ్రహస్థితి

మిథునంలో రాహువు, కన్యలో బుధుడు, తులలో సూర్య శుక్రులు, వృశ్చికంలో అంగారకుడు, ధనుస్సులో కేతువు, మకరంలో శని మీనంలో గురువు, తులా వృశ్చిక ధనుస్సులలో చంద్రుడు.

**18-10-1963 శుక్రవారము మొదలు**
**24-10-1963 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

క్రొత్త ప్రయత్నాలు కూడివచ్చే సమయం. ధైర్యం లభిస్తుంది. ఒక సమయంలో అయిన వారిని కూడా కఠినంగా చూడవలసి వస్తుంది. అధికారులు మంచి భావం చూపగల సమయం. ప్రస్తుతం అవసరం అయిన ధనం—శ్రమ, చికాకు పడకుండా లభిస్తుంది. వస్తు వాహనాదులు కొనగలుగుతారు. శ్రమకరమైన ప్రయాణం చేస్తారు. ఉష్ణ, పైత్య దోషాలవల్ల బాధపడతారు. లాటరీ వంటి పనులలో నిరుపయోగమైన సమయము. మాట మంచితనం వల్ల మీ పనులు నెరవేరటమే కాకుండా పేరు ప్రతిష్ఠలు లభిస్తవి. పుణ్యకార్యాలు జరుగుతవి. 23, 24 తేదీలలో అసౌఖ్యము, వస్తునష్టం.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

వ్యవహార రంగంలో గౌరవప్రదమైన పరిష్కారాలు కుదురుతవి. వృత్తిలో మీకు ధైర్యాన్ని ఈయతగిన మిత్రులు నిరుత్సాహాన్ని కలిగిస్తారు. బంధువులవద్ద నుంచి శుభవార్తలు తెలుస్తవి. తలవనితలంపుగా భారం పైన పడుతుంది. తగినంత కారణం లేకుండానే ఒకరిద్దరు మిత్రులు దూరంగా తొలగే అవకాశాలున్నవి. ఈ సమయంలో స్వంత కష్ట సుఖాలకన్నా యితరులను గురించి యోచించటమే సరిపోతుంది. ఆర్థిక చిక్కులు బయట పడకుండా యుక్తిగా నిర్వహించుకుంటారు. ఒక సమయంలో పై అధికారులను అనుసరించి పోవలసిన స్థితి ఏర్పడుతుంది. అన్ని సమయాలలోను ఆదాయం ఒకే విధంగా ఉంటుందని కార్యభారం పెట్టుకోవద్దు. 22, 23 తేదీలలో ఆందోళన, కలహసూచన.

* * *






దైవజ్ఞ పోతూరి శ్రీరామమూర్తి

### మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

పేరుప్రతిష్ఠలతోపాటు, మనస్సుకు కూడా సుఖం లభిస్తుంది. ఏపనినైనా తలచుకొన్నంతలోనే జరుపగల స్థితిలో ఉంటారు. వ్యాపార వ్యవహారాలలో తగిన మనుష్య సహాయం, ధన సహాయం కూడా లభిస్తవి. ప్రస్తుతం డబ్బు పెట్టుబడి పెడుతూ ఉండవలసిన సమయం. ఒక సమయంలో అందని పండుకు ఆశపడుతున్నామని అనుకోవలసి వస్తుంది. కాని, క్రమంగా మంచి మార్పు వస్తుంది. సంఘకార్యాలలో బెట్టుసరి, పట్టుదలలు వీటివల్ల ఏపనీ ముందుకు సాగించలేక పోతారు. ఈ సమయంలో మధ్యవర్తులవల్ల లాభనష్టాలు రెంటికీ అవకాశం ఉన్నది. యాత్రా ప్రయాణం చేయగలుగుతారు. వారాంతంలో ఉద్రేకం కలిగే వార్తలు తెలుస్తవి. 21, 22 తేదీలలో కుటుంబంలో అశాంతి, అసౌఖ్యము.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ప్రస్తుతం స్వశక్తికన్నా ఇతరుల ప్రోత్సాహం అధికంగా ఉంటుంది. ఏ పనిలో దిగినా ఎదటివారి ఆదరాభిమానాలు పూర్తిగా లభిస్తవి. పుణ్యవంతమైన సమయం. మీ పొరపాట్లు కూడా వాటంతట అవి సర్దుబాటు అవుతవి.. మనోధైర్యం బాగుంటుంది. వ్యవహారరంగంలో ఏ ఎండకు ఆ గొడుగు పట్టగలుగుతారు. కుటుంబంలో శుభసంతోషాలు కలసివస్తవి. వృత్తిలో కొన్ని కార్యక్రమాలు వాయిదాపడటంవల్ల కంగారు పడవద్దు. ఇతరుల సమాచారం మీకు తెలిసినా తెలియనట్టే ఉండటం అవసరం. అకస్మాత్తుగా ధనం యొక్క అవసరం ఏర్పడగల అవకాశాలున్నవి. 20, 21 తేదీలలో గౌరవప్రాప్తి, పుణ్యకార్యాలు.

* * *

### ఈ వారము ధరలు

కందులకు కొద్ది గిరాకి వస్తుంది. ప్రత్తి మందీలో నిలుస్తుంది. వేరుశనగ పప్పు, మానెల ధరలు పెరిగి తగ్గుతవి. లవంగాలకు తిరిగి ధర పలుకుతుంది. మిర్చి ధర ముందు తగ్గుతుంది, మరల కొద్దిగా పెరుగుతుంది.

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ధనం ధారాళంగా వస్తుంది, ఖర్చు అవుతుంది. కుటుంబ గౌరవం పెరుగుతుంది. పెద్దలను, గొప్పవారిని చూడగలుగుతారు. ఇండ్లు, భూములు మొదలైన వాటివల్ల ఫలితం బాగుంటుంది. ఒక సమయంలో తీవ్రమైన ఆందోళనకు గురి అవుతారు. కాని, వెంటనే పరిస్థితులు అనుకూలించి మనశ్శాంతి, ధనరూపంలో ఫలితము పొందగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో శ్రమకరమైన సమయం. అయితే ఎక్కడా చిక్కులు మాత్రం ఉండవు. స్నేహితులను గురించిన మీ సందేహాలు, ఆందోళన తొలగిపోతవి. మీ శక్తిని తెలుసుకొనకుండా భారం వహించి అవస్థ పడతారు. 19, 20 తేదీలలో ధనలాభం, ప్రయాణం.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఎప్పటికప్పుడు పరిస్థితులను అనుకూలంగా త్రిప్పుకొన గలుగుతారు. ఆదాయం బాగుంటుంది. బంధుమిత్రులలో గౌరవం పెరుగుతుంది. కుటుంబంలో అనారోగ్యాది కారణములవల్ల శ్రమ కలిగి తిరిగి, ప్రశాంతత లభిస్తుంది. ఎదటి వారికి వాక్సహాయం చేయగలుగుతారు. పుణ్య కార్యాలలో పాల్గొంటారు. ఈవారం మొత్తంమీద మీ మానసిక స్థితి మాత్రం నిలకడగా ఉండదు. కారణం ఉన్నా, లేకపోయినా ఒక సమయంలో చాలా ఉత్సాహం, మరొక సమయంలో చాలా నిరుత్సాహం కలుగుతూ ఉంటవి. వాటివల్ల ప్రత్యేకంగా కలిగే లాభనష్టాలు ఏమీ ఉండవు. మాటలలో మోసగించేవారుంటారు. 18, 19 తేదీలలో ధనవ్యయం. శుభవార్తలు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ప్రతి ఘట్టంలోనూ మీరు జాగ్రత్తగా ఉండవలసిన సమయం. మీతో అక్కర తీరగానే

తక్కెలోనిరచి తీసివేసేవారుంటారు. వ్యవహార సందర్భాలలో ఏ లోపమూ రాకుండా అండగా నిలిచేవారు లభిస్తారు. వ్యాపారాది కార్యక్రమాలలో పెట్టుబడులు పెరుగుతవి. ఆరోగ్యము, ఆనందము లభిస్తవి. అనేక సందర్భాలలో మీమాట ఆజ్ఞ మాదిరి చలామణీ అవుతుంది. అయితే ప్రసంగాలలో కాఠిన్యము, పట్టుదలలు పెరగకుండా చూచుకొనుట అవసరం. పెద్ద పెద్ద యోచనలు చేస్తూ ఉంటారు. ఆదాయం సాధారణంగా ఉంటుంది. వృత్తిలో కార్యభారం పెరుగుతుంది. 23,24 తేదీలలో కార్యభంగం, పోటీలు.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

అయినవారు ఎవరో, కానివారు ఎవరో తెలుసుకొనటం కష్టం. ఆరంభించిన ప్రయత్నాలను సాగించటమా, నిలపటమా అనే ధోరణిలో పడతారు. ఎదట ఒక రకంగాను, చాటున ఒక రకంగాను మాట్లాడే మనుష్యులతో బాధపడవలసి ఉంటుంది. అయితే సాహసంతో కొన్ని సమస్యలను తొలగించుకొన గలుగుతారు. అవసరానికి మించి ఖర్చు చేస్తారు. వృత్తి ఉద్యోగాలలో మార్పులు, శ్రమ, తోటివారితో పేచీలు కనుపిస్తవి. కుటుంబ, ఆర్థిక పరిస్థితులలో సంతృప్తికరమైన మార్పులు తెలుస్తవి. 22, 23 తేదీలలో పొరపాట్లను సవరించుకొనుట, దుబారా ఖర్చు.

* * *

## ధనుస్సు:

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

సమయం మంచిది. ఆదాయం బాగుంటుంది. సంతోషవార్తలు తెలుస్తవి. వ్యవహారఘట్టంలో జయం సాధించి బయటపడ గలుగుతారు. అప్పుడప్పుడు మీ భయ సందేహాలను పోగొట్టగల స్నేహితులు లభిస్తారు. పిల్లల ఆరోగ్యం బాగుండదు. ధారాళంగా యోచించటానికి అవకాశం లభిస్తుంది. ధన విషయంలో కొరత ఉండదు. దయతలచి కొంచెం అవకాశమిస్తే తలపైన ఎక్కేవారు తటస్థపడతారు. వారాంతంలో దొంగతనంగా వస్తువులుపోయే అవకాశాలున్నవి. అకస్మాత్తుగా దేహబాధలు కలుగుతవి. ఋణబాధ్యతలను పెంచుకొనవద్దు. 21, 22 తేదీలలో ధనవ్యయం, కలహాలు.

* * *

## మకరం:

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

వృత్తిలో అభివృద్ధికరమైన మార్పు గోచరిస్తుంది. చేసిన శ్రమకు వెంట వెంటనే ఫలితం కనుపిస్తుంది. శుభకార్యాలు కలిసిరాగల సమయం. పుణ్యకార్యాలలో పాల్గొనే అవకాశం లభిస్తుంది. కొన్ని సమయాలలో మృదుత్వము, మంచి మాటలు ఉపయోగించకపోవచ్చు. మీతో స్నేహం చేస్తూ మీ గౌరవానికి, మీ ఆదాయానికి ఆటంకాలు కలిగించేవారు ఉంటారు. చాలాకాలం నుంచి జరుగని పనులు ఈ సమయంలో పూర్తి అవుతవి. విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలు జరుగవు. వారాంతంలో ప్రయాణం చేయవలసి రావచ్చు. 20, 21 తేదీలలో ఆదాయ వృద్ధి, మాటలలో పేచీలు.

* * *

## కుంభం:

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

దైవబలం బాగున్నది. శాంతి, సుఖము లభిస్తవి. అధికారము, హోదా బాగుంటవి.. మీ శక్తి సామర్థ్యాలను స్వవిషయంలోను, ఇతరుల విషయంలో కూడా ఉపయోగించుకొన గలుగుతారు. బంధుమిత్రుల రాకపోకలు అధికం. సంఘ కార్యాలలో మీ కృషి అక్కరకు వస్తుంది. కోర్టు కచేరీలలో సమయం తెలుసుకొని కార్యం సాధించుకొన గలుగుతారు. వృత్తికి సంబంధించిన వార్తలు చాలా అనుకూలంగా తెలుస్తవి. విశ్రాంతి అవసరం. మొదట మీ మాటను కాదన్నవారు దారికి వస్తారు. వినోద కార్యములవల్ల ఖర్చులు పెరుగుతవి. వారాంతంలో మోసంవల్ల చిక్కు పడతారు. 19, 20 తేదీలలో వివాదంలో జయం, ధనలాభం.

* * *

## మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ప్రస్తుతం నిబ్బరంగా, నిదానంగా ఉండటమే మంచిది. శారీరకంగా శ్రమ కలిగినా వృత్తిలో అనుకూలత, గౌరవము లభిస్తవి. ఒకే సమయంలో రకరకాల పనులను యోచించి నిర్వహించవలసి వస్తుంది. కుటుంబ గౌరవము, ఆర్థిక స్థితి పెరుగుతవి. ఒకానొక సందర్భంలో భిన్నాభిప్రాయాలు గల మనుష్యుల మధ్య నలగవలసి వస్తుంది. ఆత్మీయులని అనుకొనేవారు వ్యతిరేక మార్గంలో పోతారు. ప్రయాణం చేయవలసి ఉంటుంది. వృత్తి వ్యాపారాలలో అభివృద్ధికరమైన మార్పులు కలసి వస్తవి. ఈ సమయంలో కలహాలు రచ్చకు ఎక్కకుండా సర్దుకుపోవటం అవసరం. నిరుత్సాహకరమైన వార్తలు తెలుస్తవి. 18, 19 తేదీలలో భయము, దేహ శ్రమ.





# కొలంబా

## రచన: ప్రాస్పర్ మెరిమె

### జరిగిన కథ

కర్నల్ థామస్ నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు. 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం. అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడిన పని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెతో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సొద్దెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది. మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది. వారు కార్సికా చేరారు. పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది. కొలంబా, ఆర్సో ఆంటన్‌ల పియత్రనెరాకి వెళ్ళిపోతారు. స్వగ్రామంలో కొలంబా బ్రాందోలాచ్చియో అనే బందిపోటు దొంగకు సహాయం చేస్తున్నట్లు ఆర్సో ఆంటన్ తెలుసుకుంటాడు. అతన్నీ లతని సహచరుడినీ కూడా కలసుకుంటాడు. పొరుగింటి బాప్టిస్ట్ పియ్యాత్రి చనిపోగా పరామర్శకు వెళ్లిన కొలంబా, ఆర్సో ఆంటన్‌లు, తన విరోధి బారిచినీని కలుసుకుంటారు. గ్రామాధికారి ఆర్సోకి విరోధాలు మానుకోమని సలహాయిస్తాడు. మిస్ నెవిల్ ఆర్సోకి ఉత్తరం వ్రాస్తుంది. కొలంబా విరోధం మానుకొనవద్దని చెబుతుంది. బారిచినీని, అతని కొడుకులనీ గ్రామాధికారి ఆర్సో ఇంటికి తీసుకువస్తాడు, సంధి కుదిర్చేందుకని. కొలంబా ఇద్దరు బందిపోట్లని సాక్షులుగా రప్పిస్తుంది.

## 16

"గ్రామాధికారిగారూ !" అని అరిచింది కొలంబా. "దయచేసి ఇతను చెప్పేది వినండి న్యాయం జరిగేట్లు చూడడం మా విధి! నిజం తెలుసుకోండి చెప్ప జియోకొంతో కాస్త్రికోని !"

"వినద్దు !" అని అరిచారు ముగ్గురు బారిచినీలు.

"అందరూ ఒకేసారి మాట్లాడితే, ఎలా వినటం ?" అన్నాడు బందిపోటు నవ్వుతూ. "జయిల్లో తొమాసోతో కలిసి ఉన్నాను. ఆర్లాందుచ్చియో తరచూ వచ్చి చూసి వెడుతూ ఉండేవాడు....."

"అబద్దం !" అని ఇద్దరన్నదమ్ములూ అరిచారు.

"రెండుసార్లు కాదంటే ఒకసారి అవునని కదా, అర్థం !" అన్నాడు కాస్త్రికోనీ మెల్లిగా. "తోమాసో దగ్గర డబ్బుండేది. బాగా తిని తాగేవాడు. నాకున్న బలహీనతలు ఇవే— వాడితో కలిసి తినటం ఇష్టంలేకపోయినా ఎన్నోసార్లు భోజనానికి కూర్చున్నాను. అసలు మనిద్దరం కలిసి తప్పించుకుందామని వాడితో అన్నాను .... ఒక చిన్న .... కాదు, ఎవరో చెప్పకూడదు కాని నేనంటే చాలా ఇష్టంఉన్న వ్యక్తి .... పేర్లు పనికిరావు .... సహాయపడటానికి ఒప్పుకొనడంవల్ల ఇది సాధ్యం అయే అవకాశం కలిగింది. కాని తోమాసో, అక్కర్లేదన్నాడు. తన సంగతి తను చూసుకోగలనన్నాడు. బారిచినీ తన తరపున జడ్జి లందరితో మాట్లాడుతాడని చెప్పాడు. నిర్దోషిగా, జేబునిండా డబ్బుతో బైటపడగలనన్నాడు .... నాకేమో ఆరు బయట గాలి ఇష్టంకదా ! ...."

"ఈ మనిషి చెప్పేవన్నీ పచ్చి అబద్ధాలు" అన్నాడు అర్లాందుచ్చియో ధృఢంగా. "మా చేతిలో తుపాకులే గనక ఉంటే, మరొకరి దగ్గర ఇలా మాట్లాడేవాడు కాదు."

"అదే పనికిరాదు !" అన్నాడు బ్రాందలాచ్చియో. "ఫాదరీతో మాత్రం పెట్టుకోకు ఆర్లాందుచ్చియో!"

"ఇప్పటికైనా వెళ్లనిస్తారా దెల్లారెబ్బియాగారూ ?" అన్నాడు గ్రామాధికారి అసహనంతో నేలని తంతూ.

"సవేరియా ! సవేరియా !" అని కేక వేశాడు ఆర్సో. "తలుపు తెరు !"

"ఒక క్షణం" అన్నాడు బ్రాందలాచ్చియో.

"ముందు మమ్మల్ని వెళ్లనివ్వండి. అయ్యా ! గ్రామాధికారిగారూ ! మనకి తెలిసినవాళ్ల ఇళ్లకి వెడితే అరగంట గడువు లేనిదే పోరాదంటారు కదా, మనవాళ్లు !"

గ్రామాధికారి అతనివంక అవజ్ఞతో కూడిన ఒక చూపు విసిరాడు.

"మీ అందరి దాసుడినీ !" అన్నాడు బ్రాందలాచ్చియో. చెయ్యి ఎత్తి, "బ్రుస్కో, అన్నాడు తన కుక్కతో. "గ్రామాధికారిగారికోసం ఒక ఎగురు ఎగురు చూద్దాం !"

కుక్క ఎగిరింది, బందిపోటు దొంగలు అవసరంగా వంటగదిలో ఉంచిన తమ ఆయుధాలు తీసుకుని తోటలోకి వెళ్ళిపోయారు. వీధిగుమ్మం మూసి ఉన్నా ఒక చిన్న తట్టు తట్టగానే మంత్రం వేసినట్లు తెరుచుకుంది.

"బారిచినీగారూ" అన్నాడు ఆర్సో తీవ్రమయిన కోపం ఉట్టిపడేట్లు. "మీకు దొంగ సంతకాలు పెట్టే అలవాటు కూడా ఉందని తెలుస్తోంది. ఇవాళే వెళ్లి మీమీద దావా వేయిస్తాను, బియాంకీతో లాలోచీ పడినట్లు. బహుశ ఇంతకన్నా పెద్ద ఆరోపణ వేస్తానేమో కూడా మీమీద !"

"నేనూ మీమీద ఆరోపణ చేస్తాలెండి దెల్లారెబ్బియాగారూ" అన్నాడు మేయర్. "బందిపోట్లతో సావాసం చేస్తున్నారు, వారికి తోడుపడుతున్నారు. గ్రామాధికారి మిమ్మల్ని పోలీసులకి అప్పజెపుతాడు."

"గ్రామాధికారి తన ధర్మం చేసుకోవాలి గదా," అన్నాడు ఆ వ్యక్తి తీక్షణంగా. "పియత్రనెరాలో అలజడి రాకుండా చూసుకోవటం మీ బాధ్యత—మీ ఇద్దరికీ చెబుతున్నాను."

మేయర్, విన్సెంటిల్లో, ఇద్దరూ అప్పటికే గది వదిలి బయటికి వెళ్లిపోయారు. అర్లాం

డుచ్చియో వారి వెంటనే నడిచి వెళ్లిపోతూ ఉండగా ఆర్సో అనేశాడు. "మీనాన్న ముసలివాడు. ఒక్క దెబ్బతో నాశనంచెయ్యగలను. మీతోనే నా యుద్ధం, మీరూ, మీ తమ్ముడూ !"

అర్లాందుచ్చియో బాకు తీసి ఆర్సోమీద పడ్డాడు. కాని, అతను కత్తిని వాడేముందే కొలంబా అతని చేతిని పట్టుకుని పోటు తప్పించి వేసింది. ఆర్సో అతని ముఖంమీద ఒక గుద్దు గుద్దాడు. తర్వాత ఒక్క తోపుతో తలుపుమీదకి నెట్టాడు. అర్లాందుచ్చియో చేతిలో బాకు క్రింద పడిపోయింది. ఇంతలో విన్సెంటిల్లో అక్కడికి వచ్చాడు కాని, కొలంబా ఒక తుపాకి అందుకుని ఆ పోట్లాట అంతటితో ఆగిపోయేట్లు చేసింది. గ్రామాధికారి కూడా వచ్చి వారికి అడ్డుపడ్డాడు. "చూద్దాంగా, ఆర్సో ఆంటన్!" అని అరిచాడు. అర్లాందుచ్చియో, అరిచి, దురుసుగా తలుపు తెరుచుకుని అవతలవైపు తాళం వేసేశాడు. దీని వల్ల వారు తప్పించుకొనడం తేలిక అవుతుంది.

ఆర్సో, గ్రామాధికారి ఒక పావుగంట దాకా మాట్లాడుకోనే లేదు. ఇద్దరు గదిలో తలోమూలా కూర్చుని ఉండిపోయారు. కొలంబా మొహంమీద గెలిచిన గర్వం కనిపించింది. అంతకుముందు జరిగిన సంఘటనలో విజయం నిర్ణయించిన తుపాకి మీద ఆనుకుని చూస్తూ నుంచుంది.

"ఏమి దేశం! ఏమి దేశం!" అన్నాడు గ్రామాధికారి హఠాత్తుగా లేచి నుంచుంటూ. "దెల్లా రెబ్బియాగారూ జరిగినది చాలు. మాట ఇవ్వండి, చట్టానికి విరుద్ధంగా ఏమీ చెయ్యను, ఈ వ్యవహారంలో న్యాయం జరిగేవరకూ, అని !"

"గ్రామాధికారిగారూ ! నిజమే ! జరిగింది చాలు. ఆపుకోలేక వాడిని కొట్టాను. కాని, అతను నన్ను ద్వంద్వ యుద్ధానికి సవాలుచేస్తే కాదని ఎలా అనను ?"

"నీతో ఉత్త యుద్ధం చేసి వూరుకుంటాడా! నిన్ను చంపాలని చూస్తాడు కాని .... దానికి ఏమేమి చేయగలడో మీరే చూస్తున్నారుగా ...."

"మమ్మల్ని మేమే రక్షించుకోగలం" అంది కొలంబా.

గ్రామాధికారిని ఉద్దేశించి "అర్లాందుచ్చియో మంచి ధైర్యంకల కుర్రాడిలాగే కనిపిస్తున్నాడు—ఫరవాలేదనుకుంటాను" అన్నాడు ఆర్సో. "నామీద కత్తి ఎత్తాడు! అతని స్థానంలో ఉంటే నేనూ అదేపని చేసిఉండచ్చు; అదృష్టవశాత్తు కొలంబా దగ్గిర బాకు లేకపోయింది."

"మీరు యుద్ధం చెయ్యటానికి వీల్లేదు" అని అరిచాడు గ్రామాధికారి. "నేను నిషేధిస్తున్నాను!"

"నా గౌరవానికి సంబంధించినంతవరకూ నా అంతరాత్మ తప్ప వేరే ఎవరూ నాకు ఆజ్ఞ ఇవ్వలేరని మనవిచేసుకుంటున్నాను."

"వీల్లేదన్నాను—అంతే !"

"నన్ను నిర్బంధిస్తారు. అంతేగా .... అంతే నన్ను బలవంతంగా ఆపేస్తారు. కాని జరగవలసినదేదో వాయిదా పడుతుంది. అంతేనా ? అయ్యా, గ్రామాధికారిగారూ ! మీరు ఆత్మాభిమానం, గౌరవం ఉన్నవారు. గత్యంతరం ఏమిటి చెప్పండి!"

"మా అన్నయ్యని నిర్బంధిస్తే వూరిలో చాలా మంది కలిసి మీమీద దాడి చెయ్యవలసి వస్తుంది" అనేసింది కొలంబా.

"చెబుతున్నాను వినండి, వూరికే గొప్పలు చెప్పుకోవటం కాదు—మేయర్‌గా బారిచినీ తన అధికారం దుర్వినియోగం చేస్తే నేను నా ప్రయత్నాలు చేసుకోవలసి వస్తుంది."

"ఇవాళనుంచి బారిచినీగారి అధికారాన్ని ఆపివేస్తున్నాను" అన్నాడు గ్రామాధికారి. "అయ్యా, మీ ధోరణి నాకు నచ్చింది..... మీరు అడిగేది న్యాయంగానే ఉంది. అయితే నేను కోర్టుకి వెళ్లి వచ్చే వరకూ ఓపిక పట్టండి ! మూడు రోజుల్లో తిరిగి వచ్చేస్తాను. నాతో 'ప్రాసిక్యూటర్' ని తీసికొస్తాను. ఈ వ్యవహారం—చాలా విచారకరమయినది. పూర్తిగా అనుశీలిస్తాము. అంతదాకా యుద్ధాలు మొదలుపెట్టనని మాట ఇస్తారా ?"

"ఎలా మాట ఇవ్వగలను ? అర్లాందుచ్చియో అంతలోపుగానే సవాలు చేస్తే ?"

"దెల్లా రెబ్బియాగారు, మీరు మిలటరీలో ఉన్నారు. కేవలం ఒక దొంగ అని మీరే అంటూ అతనితో యుద్ధానికి దిగుతారా ?"

"అతనిమీద చెయ్యి చేసుకున్నాను కదండీ !"

"పట్టి దొంగని కొట్టి అతను మిమ్మల్ని సవాలుచేస్తే పోటీ పడతారా ? ఏమిటిది ఆర్సో గారూ ! పోనీ, ఇదయినా అడుగుతున్నాను కాదనకండి .... మీరు అర్లాందుచ్చియో కోసం వెతక్కండి

---

సుబ్బమ్మగారు : నేను మేడ మీద ఉంటాగాని, ఈ గాజు సామాను కడిగేటప్పుడు ఏ ఒక్కటి పగిలిపోయినా, వచ్చి నాతో చెప్పు.

పనిమనిషి : మీరు కింద ఉండటమే మంచిదండీ; అస్తమానం నేను మేడ ఎక్కలేనండి.

కె. రంగారావు

---

..... అంతగా అయితే నేనే మీ పోట్లాటకి చోటు నిర్ణయిస్తే ఒప్పుకుంటాను."

"అతనే అడుగుతాడు, నాకు అనుమానం లేదు. కాని, నేనుగా వెళ్లి దెబ్బతియ్యనని మాట ఇస్తున్నాను."

"ఏమి దేశం !" అన్నాడు మళ్లీ గ్రామాధికారి వేగంగా ఇటూ అటూ నడుస్తూ. "నేను ఫ్రాన్సుకి తిరిగి పోవటం ఎప్పుడు ?"

"గ్రామాధికారిగారూ" అంది కొలంబా తియ్యటి గొంతుకతో. "ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. మాతో భోజనంచేస్తే మాకు చాలా సంతోషంగా ఉంటుంది."

గ్రామాధికారి నవ్వకుండా ఉండలేకపోయాడు. "ఇప్పటికే ఇక్కడ చాలాసేపు ఉండిపోయాను.... పక్షపాతం చూపించా నంటారు .... ఈ వెధవ గడ్డ ....."

"మిస్ దెల్లా రెబ్బియాగారూ మీరింకా ఇవాళ మీ రెంతపని చేశారో తెలుసా ?"

"పోనీలెండి గాని, మా చెల్లెలు ఎంత గట్టి నమ్మకంతో ఉందో ఇప్పటికయినా మీకు తెలిస్తే అదే చాలు. తర్వాత అవన్నీ నిజం, అవి మీకే తెలియగలదు."

"సెలవు !" అన్నాడు గ్రామాధికారి చెయ్యి ఎత్తి. "మిమ్మల్ని ఎప్పుడూ ఒక పోలీసు సార్జెంటు కనిపెడుతూనే ఉంటాడని హెచ్చరిస్తున్నాను."

గ్రామాధికారి వెళ్లిపోయిన తర్వాత, "ఆర్సో" అంది కొలంబా. "నువ్వు యూరోప్‌లో లేవని గ్రహించు. అక్కడ ద్వంద్వయుద్ధాలని గురించి అర్లాందుచ్చియోకి ఏమీ తెలీదు. వీడి చావువల్ల మరొక ధైర్యంకలమనిషిచచ్చిపోవటంన్యాయంకాదు."

"కొలంబా, నువ్వు నిజంగా దిట్టవయిన దానివి. కత్తిపోటు తగులకుండా రక్షించినందుకు నీకెంతో ఋణపడి ఉన్నాను. ఏదీ, నీ చెయ్యి చూపించు, ఒకసారి ముద్దు పెట్టుకోనీ. కాని, చూడు ! నా యిష్టం వచ్చినట్లు నన్ను చెయ్యనీ. భోజనం పెట్టు. గ్రామాధికారి ప్రయాణంమీద బయలుదేరిపోయి ఉంటాడుకదా ! ఆ చిన్నమ్మాయి చిలినాకి కబురుచెయ్యి. ఈపనికి ఆమె సహాయం కావాలి! ఒకఉత్తరంఇచ్చిపంపుదా మనుకుంటున్నాను."

కొలంబా భోజనం తయారుచెయ్యటానికివెళ్లింది. ఆర్సో తన గదికి వెళ్లిఒకఉత్తరంవ్రాశాడు:

—"నన్ను శీఘ్రంగా వచ్చి కలుసుకోవాలి. ఎంతో వ్యవధిలేదు. ఎక్వానివా లోయలో రేపు పొద్దున ఆరు గంటలకి ఎదురు చూస్తూ ఉంటాను. నాకు పిస్టల్ పేల్చటం బాగా వచ్చు. మీరు ఇదే ఆయుధము తీసుకుంటే మంచిదికాదు. మీకు తుపాకి కాల్చటం బాగా వచ్చునని విన్నాను. ఇద్దరం చెరి ఒక జోడు గుళ్ల తుపాకి తీసుకుందాము. ఈ వూరి మనిషిని ఒకడిని వెంటపెట్టుకుని వస్తాను. మీ సోదరుడు కూడా వచ్చేటట్లయితే మూడవ మనిషి ఒకరిని సాక్షిగా తీసుకువచ్చి నాకు ముందుగా తెలియచెయ్యండి. అప్పుడు మాత్రం నేనూ నావెంట ఇద్దరినీ తీసుకువస్తాను.

—ఆర్సో ఆంటోనియో దెల్లా రెబ్బియా."

గ్రామాధికారి మేయర్ పక్కఇంట్లో ఒక గంట ఉండిపోయాడు. ఆపైన బారిచినీ ఇంటికి వెళ్లి కొన్ని నిముషాల తర్వాత కోర్టుకి బయలుదేరి వెళ్లిపోయాడు. అతనితోబాటు ఒక పోలీసు మాత్రమే వెళ్లాడు. పావుగంట తర్వాత చిలినా తనకి ఇచ్చిన ఉత్తరాన్ని అర్లాందుచ్చియోకి ఇచ్చింది.

జవాబు ఆ రాత్రికే వచ్చింది. బారిచినీ సంతకం పెట్టిఉంది. తన కొడుకుని బెదిరించినట్లు 'ప్రాసిక్యూటర్' కి చెప్పగలనని వ్రాశాడు.

"మీ అపనిందలు వట్టివని తెలిసిపోగలదు. నా అంతరాత్మ చెబుతున్నది." అని ముగించాడు బారిచినీ తన ఉత్తరాన్ని.

ఇదంతా జరుగుతూ ఉండగా కొలంబా పురమాయింపుమీద అయిదారుగురు గ్రామ ప్రజలు వచ్చి దెల్లా రెబ్బియా ఇంటిచుట్టూ కాపలా నుంచున్నారు. ఇది చూసి మరికొందరు కూడా వచ్చి కాపలా కాస్తామన్నారు. 'జిజ్ఞాస' కల బందిపోటు ఒక ఉత్తరం వ్రాసి పంపాడు. తనూ, బ్రాండోలాచ్చియో, పోలీసుదాడి గనక జరిగినట్లయితే సహాయపడటానికి సిద్ధంగా ఉన్నామని తెలియజేశాడు. ఇద్దరూ సంతకాలు పెట్టారు. సంతకం తర్వాత ఒక వాక్యం ఉంది—"మా మిత్రుడు బ్రుస్కోకి నేర్పిన పాఠం గురించి గ్రామాధికారి ఏమనుకున్నారో మిమ్మల్ని అడగవచ్చునా ? చిలినా తర్వాత అంత బాగా గంతు లేయగలవారెవరూ లేరు, అంత మంచి స్వభావం కలవారూ లేరు."

(ఇంకా ఉంది)




(గత సంచిక తరువాయి)

ఓమాటు బామ్మగారి ముఖ కవళికలను పరిశీలించాను. ఆవిడ మొఖంలో సంతోషపు చాయలు కన్పించాయి. గురికుదిరింది లెమ్మని నా పని నేను చూసుకుంటున్నాను. సోదమ్మి గతమంతా ఏకరువు పెడుతోంది. బామ్మగారు ఓమాటు నా కళ్ళల్లోకి చూసింది తృప్తిగా. భేష్! అనుకున్నాను మనసులో......

"ఇంతకూ ఇప్పుడు తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా జరుగుతుందా?......" అడిగింది బామ్మగారు.

ఎరుకలసాని అరనిముషం కళ్ళుమూసి ధ్యానం చేసి. గతుక్కుమన్నట్టు మొహం పెట్టి భయసంకోచాలతో బామ్మగారివైపు చూసింది.

"అయ్యో! అనుమానం దేనికి? ఉన్న దున్నట్టు చెప్పు" ధైర్యం చెబుతూ ఆదుర్దాతో దగ్గరగా జరిగి కూచుంది బామ్మగారు. "ఓయమ్మ మనవరాలి పెళ్ళిమాటడుగుతుండవ్ ..... అయినవారిలోనే పేగు సమ్మందమున్నచోట యిచ్చుకోవాలనుకుంటుండవ్. నీవనుకున్నది జరిగి తీరుద్ది. కానీ....." అంటూ ఆపేసరికి బామ్మగారికి కంగారు ఎక్కువయింది. తొందర చెయ్యడం మొదలెట్టింది. ఇక విధి లేనట్టూ "జయమ్మ! మీ కోడలు నీల్లోసుకోనుండంగా పొద్దుటేళ, పాలకుండకు చుట్టేసుకున్న తాచుపామును చంపిండు మీ యబ్బాయి.... అది జాతి సర్పం తల్లే.......తాళిగట్టిన ఏడాదిలోగా అమ్మాయి పసుపు కుంకుమ సెరిగిపోతుంది. సర్పదోషానికి తిరుగుండదు.......తగిరి తీరుతుందమ్మ........ఇంక నేనేం చెప్ప?......." అంటూ కఱ్ఱ పుల్లను గంపలోకి విసిరి మహా బాధపడుతున్నట్లుగా ఉసూరుమంది ఆ అమ్మి.

"ఆ!!" అంది బామ్మగారు గుడ్లప్పగించి నోరు తెరిచి ఆ అమ్మిని చూస్తూ. ఐదు నిముషాల వరకూ అలాగే అచేతన శిలా ప్రతిమలా ఉన్న ఆవిడను చూస్తే నాకు నిజంగానే గాభరా వేసింది. ఆ తత్తరపాటులో "ఏయ్! అమ్మీ! నిజం చెప్తున్నావా? అబద్ధమా?........" కాస్త విసురుగా అడిగాను. అయినా—నా తెలివి తక్కువ కాకపోతే 'నేను అబద్ధమే చెప్తున్నానని ఎవరన్నా' అంటారా చెప్పండీ? ఎరుకలసాని ఒక్క మాటు బుస్సున లేచింది. "ఏడ దొరికినవు తల్లి! ఎరుకలసాని మాటకే తిరుగు సెబుతుండవ్....... లేంది సెప్పడానికి నాకేటి బట్టింది?........నా వాక్కులో లోపాల్లుంటె మరి ఈ గంప ముడితే ఒట్టే!...... ఆ! ఆ!......." అంటూ విసురున గంపెత్తి చంకన బెట్టుకుంది.

హోసి దీని దుంపతెగ!! గంప ముట్టుకునల్లా ప్రమాణం చేస్తోంది చూడండీ అన్నట్లూ ఆశ్చర్యం ఆరుపాళ్ళు అమాయకత్వం నాలుగు పాళ్ళూ కలబోసి చూపు చూశాను బామ్మగారివైపు. ఆవిడ మరీ నీరసపడిపోయినట్టు కన్పించింది. అప్పుడే ఒడినిండా మొల్ల మొగ్గలతో వచ్చిన మా రాధ గేటు తీస్తున్న అమ్మిని చూసి "అక్కయ్యా! ఈ అమ్మిని ఎక్కడో చూసినట్లుంది గదే!" అంది మహా తెలివి తేటలు పండిపోయినట్లు. ఆపళంగా చెంప చెళ్ళుమనిపించాలనుకొన్నా. ఆ కోపం దిగమింగి "నీ మొహం ఇవ్వాళ ఈ పేటకొస్తే నిన్న మన పేట కొచ్చుండగూడదూ?......." అని సర్దేశాను. ఎందుకేనా మంచిదని బామ్మగార్ని గమనించాను. ఆవిడ విన్నదిగాని ఏమీ పట్టించుకునే స్థితిలో లేదు. దీన్నిక్కడినుండి తరిమేస్తే మంచిదని "ఇంక మొగ్గల్లేవా?" అన్నాను. "ఉన్నాయి" అంటూ మళ్ళీ పరుగెత్తింది రాధ.

బామ్మగారి పరిస్థితి వర్ణనాతీతం. ప్రవాహంలో తన వారినీ, ఆస్తినీ పోగొట్టుకుని కట్టుగుడ్డలతో నిలిచిన వరద బాధితునిలా కూచుంది. ఆ కళ్ళల్లో వెనుకటి దర్పంలేదు. మనిషిలో ఆ ఠీవి లేదు. మాటలో ఆ గంభీరతలేదు. ఆ కళ్ళు చెరువులయినయి. ఆవిడ కూలిన ఇల్లులా గోడకి చేరబడిపోయింది. మాటే పెకిలి రాకుండా ఉంది. పాపం! పెద్దపులిలాంటి బామ్మగారు పిల్లికూన అయిపోవడం చూసి నా హృదయం ద్రవించింది. ఇంట్లో తిని ఇంటి వాసాలు లెక్క పెట్టినట్టు ఆవిడ చేతి మజ్జిగ త్రాగి.......ఛీ!ఛీ! మనుమడూ, మనుమరాలూ కాపురం చేస్తుంటే చూడాలని ఎంత ముచ్చట పడ్డదో పెద్ద ప్రాణం!..... "పోనిస్తురూ బామ్మగారూ. వాళ్ళేదో చెప్తుంటారు అంతేగాని.......వాటికేంటిలెండి......." అని నాలిక కర్చుకున్నారు. ఇంకో క్షణమైతే నా నోటినుంచి నిజం వచ్చేసేదే సుమండీ. ఇంతా చేసి సిద్దాన్నంలో మట్టి పోసినట్టు. ఈ జాలికి వేళా పాళా తెలీదు అని నన్ను నేనే గట్టిగా కోప్పడుకుని (మనసులో లెండి) పైకి "అయినా—ఏ పుట్టలో ఏ పాముందోనని పూర్తిగా కొట్టెయ్యడాని క్కూడా లేదండీ. వెనక మా పిన్ని విషయంలో అచ్చులాగే జరిగిందని అమ్మ చెబ్తుండేది (మా అమ్మకు చెల్లెళ్ళే లేరు. ప్రాణ విత్తమాన భంగమందు బొంకితే అఘము ఉండదు అని వెనకటికో మహానుభావుడు లైసెన్సు ఇచ్చేశాడుగా)" దిగులుగా అన్నాను.

బామ్మగారు ఓమాటు కళ్ళెత్తి "అదేనమ్మా అందులోనూ చిట్టెమ్మ దారం పట్టుకు కొండకు పాకింది. ఆ ఒక్క నలుసూ దాని ప్రాణం! చూస్తూ చూస్తూ ఎట్లాగమ్మా?......" బావిలోంచి వచ్చినట్లున్నాయి ఆవిడ మాటలు.

"అబ్బే ఎట్లా చేస్తారండి! అనుమానం పెనుభూతం. పెళ్ళంటే నూరేళ్ళ పంట అంటారు" అన్నానేగాని ఇంకో ఆలోచన పోయింది. కొంపదీసి ఈవిడ లక్ష్మికి పెళ్ళి మానేస్తే కుర్రకారు ఆలోచనలు దూరంపోవు......అనుకుంటుండగా

బామ్మగారు గబుక్కున నా చేతులు పట్టుకుని "అమ్మాయి! ఈ మాట లక్ష్మితో అనబోకు. పెళ్ళే చేసుకోనని మొండి కెత్తుతుంది" అంటూ బ్రతిమాలింది.

వెదుకబోయిన తీగ కాలికి తగిలింది! "నాకు తెలీదా బామ్మగారూ? పోనీ—దగ్గరలో మరో సంబంధం లేదాండి?" అన్నాను.

"లేకేం? వాళ్ళ మామయ్య కొడుకే ఉన్నాడు" ఆలోచిస్తూ బామ్మగారు అనేసరికి రొట్టె విరిగి నేతిలోనే పడిందని ధైర్యంగా వూపిరి తీసుకున్నాను. "లక్ష్మి ఇంకా రాలేదు. చీకటి పడితే అమ్మ కోప్పడుతుంది. ఇకనే వస్తానండి. లక్ష్మికి ఓ మాటు మా ఇంటికి రమ్మన్నానని చెప్పండి!" అంటూ లేచాను. "అమ్మాయి, ఎక్కడా నోరు జారకమ్మా" మళ్ళీ హెచ్చరించింది. "అయ్యో! అలా గనుకోకండి. దైవ సాక్షిగా నేనూ లక్ష్మికి మేలే కోరుతాను" అని ఆవిడకు భరోసా ఇచ్చాను.

మా వాకిట్లో అడుగు పెడ్తుండగానే అమ్మ "నీకోసం శశికళ వచ్చి మేడమీదుందే" అంటూ చెప్పింది. చెప్పులైనా విప్పకుండా పరుగెత్తి "అబ్బా! బలేగా నటించావే!" సంతోషంకొద్దీ తన చెయ్యి గట్టిగా నొక్కేశాను.

"ఏమి యాక్షనో పోవే.....ఇవ్వాల్టితో జీవితం ఆఖరనుకున్నా......."

"వేనకు వేలు ప్రేక్షకులను మెప్పించ గలిగిన కళా సరస్వతికి ఒక్క మనిషి ముందు నటించడం ఏం కష్టమే?.......పెద్ద కబుర్లుగానీ......"

"ఆ విషయం వేరు కమలా. నటిస్తున్నట్లు తెలుసునన్న విషయం మనకు కొంత గుండె నిబ్బరాన్నిస్తుంది. ఇదలా కాదే......"

"సర్లేగాని—ఇంతకూ అంత లేట్ చేశావేం?"

"అమ్మా నువ్విచ్చిన అడ్రసు కనుక్కునేసరికి పెద్దలు కన్పడ్డారు!"

"ఇంటి గుర్తులు చెప్పానుగాదే?....."

"నీ గుర్తులు నమ్ముకుంటే కుక్కతోక బట్టి గోదావరీదినట్లే. ఆ పట్టాభిపురంలో 'బి' క్లాస్ ఇళ్ళు అన్నీ ఒక్క మాదిరేనా!......ప్రతి ఇంటా మందార, గులాబీ పూల చెట్లుండే. నువు చెప్పిన గుర్తుల ప్రకారం ఓ ఇంటి గేటు అలా తీశానో లేదో అల్సేషియన్ కుక్క భోయ్‌మనడంతో మన స్పీడో మీటరు నలభయి దాటింది. పేరు బల్లలేని ఇల్లుగా మరో గేటు తీశాను. వాకిట్లో ఎవరెవరో ఉన్నారు. "వచ్చాంరా" అనుకుని పిలుస్తున్నా విన్పించుకోకుండా వచ్చేస్తుంటే బయట కల్లా వచ్చి పిల్చుకెళ్ళారు......ముచ్చటలు పోశాయి. ఇంత నాస్తికురాల్ని ఈ గండం గడిస్తే శనివారం ఓ కొబ్బరికాయ కొడ్తానని దేవుడికి మొక్కుకున్నాను. ఇక ఏం చెయ్యటానికీ తోచక తైరు కొట్టాను చూడూ......ఆవిడ పెరుగ్గారెలా ఉబ్బిపోయి పాత రవిక గూడ బహుమతిచ్చింది ఇదుగో చూడు. అవాకులూ, చవాకులూ నాలుగూ వాగి బయట పడేసరికి 'గాస్ ఛాంబర్' లోంచి బ్రతికి బయట పడ్డట్టయిందనుకో మన పని......"

ఈ చెప్పింది వింటే నాకు జాలేసింది. ఆప్యాయంగా తల నిమురుతూ "ఒక ప్రాణం కాపాడి పుణ్యం నీకేనే......" అన్నాను.

* * *

పచ్చటి తోరణాలతో పెళ్ళి పందిరి కలకలలాడుతోంది. మా అమ్మ పెద్ద బెనారసు పట్టుచీర కట్టుకుని హడావిడిగా తిరుగుతున్నాను. సాయంత్రం లగ్నం. కానీ బామ్మగారు మా ఇంటికొచ్చి "మా లక్ష్మికి తల్లా? తోడా?.......కాస్త అమ్మాయిని ప్రొద్దున్నే పంపితిరా కన్య ముత్తయిదువ కాస్త వచ్చిన వాళ్ళకు బొట్టేనా పెడుతుంది. దానికి తోబుట్టువులా" అని అడిగింది. అమ్మ 'సరే'నని చెల్లిని తోడిచ్చి పంపింది. లక్ష్మి తరఫు బంధువులు కొద్దిమందే వచ్చారు.

వరపూజఅయి ఇంటి కొచ్చి లక్ష్మి దగ్గరకు వెళ్తున్నాను. ఇంతలో హడావుడిగా అరుణవచ్చి నన్ను డాబా మీదికి లాక్కెళ్ళింది. "కొంప మునిగిందే......" అది ఆయాసంగా కూలబడుతూ. "ఏం జరిగిందే?......" నాకు కంగారెక్కువయింది

"ఏముంది? అంతా బూడిదలో పోసిన పన్నీరైంది. 'లక్ష్మికి ఏదో దోషం ఉంది. ఏడాది తిరిగేలోగా వైధవ్యం వస్తుంద'ని ఎవరో చెప్పారుట చస్తే నా కొడుక్కి ఈ పిల్లను చేసుకోనంటూ మూటా ముల్లె సర్దుతోంది మాపిన్ని!"

నా పై ప్రాణాలు పైనే పోయాయి. కింద కూలబడ్డాను. చివరికి "మీ గోపీ ఏమంటున్నాడు?" అని అడిగాను.

"ఇవన్నీ మూఢ నమ్మకాలు. ఏమీ జరగదంటూ అన్నయ్య ఎంత నచ్చచెప్పినా పిన్ని వినందే? చూస్తూ చూస్తూ చెట్టంత కొడుకును పోగొట్టుకుంటానా అంటూ ఏడుపు. కాదంటే ఏమయ్యో గొయ్యో చూసుకుంటాను అని పట్టుబట్టింది. బాబాయి, అమ్మ, నాన్నా ఎవ్వరూ ఏమీ అనలేక పోతున్నారే. నువ్వే త్వరగా ఏదో ఉపాయం ఆలోచించు. ఈలోగా కొంచెంసేపు బయల్దేరకుండా ఆపుతాను నేవెళ్ళి" అంటూ తను వెళ్ళిపోయింది.

నిముషంలో ఇల్లంతా గుప్పుమంది. నేను అక్కడే కూచుని ఆలోచిస్తున్నాను. ఇది సింగమ్మగారి పనే. ఇందాక వరపూజ కొచ్చినావిడ మాతో తిరిగి రాలేదు. పాలుకాచి త్రాగబోతూ ఒలకపోసి నట్టయింది. ఏం చెయ్యాల్రా భగవాన్! అని మెదడు సానపెడ్తున్నాను. మనసు గజిబిజిగా ఉంటే ఆలోచనలే తట్టవ్!......

"కమలా! మీ అందరికీ గుడ్‌బై......" లక్ష్మి కంపిత స్వరం విని వెనుదిరిగాను. లక్ష్మి ముఖం కందగడ్డలా ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. "అదేమిటే!......" ఆశ్చర్యంగా అడిగాను. "అవునే కోరిన వరుడు, పీటలమీద పెళ్ళి తప్పిపొయ్యాక ఏ ముఖం పెట్టుకు బ్రతకాలే?.......రైలుక్రింద తల బెడితే ఐదు నిముషాలు పట్టదు ఈ పాడు బ్రతుకు అంతమవడానికి" లక్ష్మి మాటలు అసలే మెదడుతో కుస్తీ పట్లు పడ్తున్నానేమో అరికాలి మంట నెత్తి కెక్కించినయి. "పిచ్చి పిచ్చిగా వాగావంటే పోలీసుల్ని పిలుస్తాను. ఐ. పి. సి. త్రీనాట్ వైన్ క్రింద జైల్లో మూస్తారు. తిక్కతిన్నగా కుదురుతుంది" అన్నాను.

"హుం! జైలు గోడలు మనుషుల్ని బంధించగలవుగానీ, మనసుల్ని బంధించగలవుటే?"

"మాచెర్ల రైలు వచ్చే వేళయింది. ఏమాత్రం చస్తావో చూస్తాను పద. ఇలా వాగుతుండు బామ్మగార్ని పిల్చుకొస్తా. కాళ్ళూ చేతులూ కట్టి పారేస్తారు" విసుగ్గా అన్నాడు.

"అవేం మాటలే?....." అంటున్న లక్ష్మి బిక్కముఖం చూసి జాలేసింది. "కాకపోతే ఏంటి లక్ష్మి? ...... కష్ట మొచ్చినప్పుడు తప్పుకునే ఉపాయంఆలోచించాలిగాని చచ్చి ఏం సాధిస్తావ్? ఇక్కడేమో ఏం చేద్దామా అని తల బద్దలు కొట్టుకుంటుంటే ఒక్క క్షణం ఆలోచించుకోనీకపోతివి. ఆమాత్రం నమ్మకం లేదా?......అన్నట్లు దగ్గర్లో ఎక్కడైనా ఫోనుందా?......"

ఏమనుకుందో ఏమో లక్ష్మి "మనింటికి మూడిళ్ళ కవతల ఇంట్లో ఉంది" అని చెప్పింది.

నేను ఫోన్ చేసి వచ్చేసరికి దిగువ హాల్లో దిగాలుపడి నిల్చున్నది బామ్మగారు. పక్కనే సింగమ్మగారు నిలబడి, "ఫోనీవే. పొయ్యేవాళ్ళను బ్రతిమాలే దేమిటి? ఇది కాకపోతే దీని తాతలాంటి సంబంధం మరోటి.......అంతగా దొరక్కపోతే మన పిల్ల మనకు బరువా? మనింట్లోనే ఉంటుంది......" అంటూ నూరి పోస్తున్నది.

ఆవిడమీద ఒళ్ళు మండిపోయింది. కాస్త హెచ్చుస్థాయిలో "అదేంటండీ? ఫలానా తులసమ్మగారి మనుమరాలికి పీటల మీద పెళ్ళి తప్పిపోయిందంటే ఆ నామోషి ఆవిడకా? మీకా? ఇంత దాకా ఆవిడ్ని వేలెత్తి చూపించిన వాళ్ళు లేరు. అసలు పీటలమీద పెళ్ళి. పైగా మేనమామ కొడుకే తిరిగి పొయ్యారంటే వేరే సంబంధం ఎలా కుదురుతుందండీ?......మీరే చెప్పండి బామ్మగారూ! పెళ్ళి చెయ్యకుండా మీరున్నవ్వాళ్ళు పువ్వుల్లో పెట్టి చూసుకుంటారు. ఆనక దాని గతి?.... అయినా ఆడ పెళ్ళివారం ఆ మూడు ముళ్ళూ పడేదాకా అణగి మణిగే ఉండాలి......రండి బామ్మగారు మీ ముందు వాళ్ళు నోరే ఎత్తరు" అంటూ పెద్ద ఆరిందాలా ముందు నేనే దోవ తీశాను. వంటే పిల్లలా వెంట బయల్దేరింది బామ్మగారు.

"చిన్నదైనా సభ మెచ్చే మాట చెప్పింది" ఓ పెద్ద ముత్తయిదువ వెనుకనుండి మెచ్చుకుంటోంది.

దుఃఖం అనేది ఎంతటి ధీరుల్ని గూడ బోల్తా కొట్టిస్తుంది. పాపం బామ్మగారు పెళ్ళి కొడుకు తల్లి కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమాలుతోంది. ఆవిడ మాత్రం పట్టిన పట్టు విడవటం లేదు. పక్కనే ఉన్న నేను "తండ్రి తర్వాత తండ్రంతటి వాడు మేనమామ. తల్లిలేని పిల్లను మీరే ఇలా రచ్చకెక్కిస్తే దాని బ్రతుకేం కావాలో ఆలోచించండి" అన్నాను.

"నువ్వూ అట్లా అంటావేం కమలా? ఇలాంటి విషయాల్లో ఏ తల్లి మాత్రం ఒప్పుకుంటుందా? చెప్పు" సూటిగా ప్రశ్నించింది అరూ వాళ్ళ పిన్ని.

"మీకున్న అనుభవంలో నాకేపాటి చెప్పండి. మీకు చెప్పతగ్గదాన్ని కాదు—అయినా గిట్టనివాళ్ళు లక్ష కల్పిస్తారు. అన్నింటినీ పట్టించుకుంటే ఎలాగండీ. లక్ష్మిది దివ్యమైన జాతకం. అంతగా మీ కనుమానం ఉంటే మంచి జ్యోతిష్కుడ్ని పిలిపించకోండి. అనుమాన నివృత్తి అవుతుంది. ఎలాగ వ్యవధి ఉందిగా......" నచ్చ చెప్పి చూశాను.

"ఏ దోషమూ లేకపోతే మేనత్త కొడుకివ్వాలని ముహూర్తాలు కూడ పెట్టుకోబోయిన వాళ్ళు ఎందుకు మానుకున్నట్టు? దీనికేం జవాబిస్తావ్?...' అంటూ ఎదురు సవాలు వేసింది.

34 వ పేజీ చూడండి

# శ్రీరామచ

## బాలకాండము - 1

శ్రీ జానకీ వల్లభో విజయతే

"వర్ణానామర్థ సంఘానాం రసా నాం
ఛంద సామపి,
మంగళానాంచ కర్తారౌ వందే
వాణీ వినాయకౌ"

భవానీ శంకరౌ వందే శ్రద్ధా విశ్వాస
రూపిణౌ,
"యాభ్యాం వినా నపశ్యంతి సిద్ధాః
స్వాంతఃస్థ మీశ్వరం"

"నానాపురాణ నిగమాగమ సమ్మతం,
యద్రామయణే నిగదితం క్వచి దన్యతోఽపి—
స్వాంతః సుఖాయ తులసీ రఘునాథగాథా,
భాషా నిబంధ మతి మంజుల 'మాతనోతి.'

**సతీ-శంకరుల సంవాదము :**

"నీల సరోరు హశ్యాం తరున అరున
వారి జనయన,
కరవు సోమమ ఉరమధామ సదా
ఛీర సాగర సయన్.

భరద్వాజుడు శమదమ దయా—గుణములు కలిగిన మహా తపస్వి, గొప్ప రామభక్తుడు. ఆ మహర్షి ఆశ్రమము ప్రయాగ క్షేత్ర మందుండెను. గంగా యమున సరస్వతీ



నదులకు సంగమ స్థానమైన ప్రయాగ క్షేత్రమును త్రివేణీయని కూడ పిలిచెదరు.

మకరసంక్రమణ పుణ్యకాలమున మాఘ స్నానములు చేయుటగాను దేవతలు, దానవులు, మునులు, నరులు, కిన్నరులు మున్నగు నానాలోక వాసులు

తెలుగు: ముం

# తమానస

ప్రయాగ క్షేత్రమునకు వచ్చుచుందురు. ఆ వచ్చిన యాత్రికులు త్రివేణిలో మాఘ స్నానములు చేసి, త్రివేణీ మాధవస్వామిని శ్రద్ధాభక్తులతో సేవించి, అచ్చట నున్న అక్షయ వటవృక్షమును స్పృశించి, భరద్వాజుని ఆశ్రమములో చేరి భగవన్నామ సంకీర్తన చేయుచుందురు.

ఇట్లు ప్రతి సంవత్సరము భక్తసమాజము



మాఘ మంతయూ ప్రయాగలో గడపి మాసాంతమున తమ తమ నిజ నివాసములకు వెళ్లుచుందురు.

ఒకసారి ప్రయాగకు వచ్చిన మునిజను లందరు మాఘ స్నానములు పూర్తిచేసుకొని నిజాశ్రమములకు వెళ్లిపోయిరి. తుదకు జ్ఞానసంపన్ను డగు యాజ్ఞవల్క్య మునీశ్వరుడు కూడ స్వాశ్రమమునకు బయలుదేర నుండెను. ఇంతలో భరద్వాజుడు యాజ్ఞవల్క్యుని వద్దకు వచ్చి, అతని పాదములు పూజించి మునీశ్వరుని ఉచితాసనాసీనుం జేసి మృదుమధుర వాక్యముల ఇట్లు విన్నవించుకొనెను—

"ఓ మునిరాజా! రామనామము యొక్క ప్రభావము అనంతమైనదని ఋషులు, పురాణములు, ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. అవినాశి జగద్వంద్యుడైన సదాశివుడు సైతం ఆ రామనామమును సదా జపించుచుండును. ఇదియే గాక త్రిపురారి శివుడు ఇతరులకు కూడ రామ మహిమను ఉపదేశించుచుండును. మహాత్మా! ఆ రాముడెవరైనది నాకు చక్కగ తెలియకున్నది.

"అయోధ్యా నగరమున జన్మించి భార్యావియోగ దుఃఖముచే రావణుని సంహరించి — జగత్ప్రసిద్ధి నొందిన దశరథరాముడేనా యీ రాముడు! లేక మరియొక రాముడు కలడా! ఎవరి నామ సంకీర్తనము శంకరుడు సదా చేయుచుండునో అవగత మగుటలేదు. సర్వజ్ఞులగు మీరు నా యీ సందేహము నివృత్తి చేయవలసినదిగా వేడుచున్నాను" అని భరద్వాజముని విన్నవించుకొనెను.

అంతట యాజ్ఞవల్క్య మహర్షి నిముస కాలము నిమీలితనేత్రుడై, ఇంచుక యోచించి, పిమ్మట మందహాసము చేయుచూ భరద్వాజుని కిట్లనెను—

"భరద్వాజా! నీవు మనోవాక్కాయ కర్మలచే రామభక్తునివి. అయినను రాముని మహిమా రహస్యములను నావలన వినగోరి ఇట్లు ఏమీ తెలియని వానివలె నన్నడిగితివి. నీ చమత్కారమునకు మెచ్చి ఆహ్లాదకరమైన రామకథను నీకు వివరించి చెప్పుచున్నాను. వత్సా! భరద్వాజా! మోహ మహిషాసురుని మర్దించుటకు మహాకాళి వంటిది, భక్తచకోరములకు చల్లని చంద్రకిరణముల వంటిది యగు రామ చరిత్రను ఆలకించవలసినది.

ఇవ్విధముగ నీవలెనే ఒకప్పుడు పార్వతికి సందేహమేర్పడగా పరమశివు డామెకు సమాధాన మిచ్చియుండెను. పార్వతీశంకరులకు ఏ కారణమున, ఎప్పుడు, ఏవిధముగ సంవాదము జరిగెనో దానిని నా శక్తికొలది నీకు సవిస్తరముగ చెప్పుచున్నాను ఆకర్ణించవలసినది." అని చెప్పి యాజ్ఞవల్క్యుడిట్లు ప్రసంగించెను—

త్రేతాయుగములో ఒకప్పుడు శివుడు జగజ్జనని భవానితో అగస్త్య మహర్షి ఆశ్రమమునకు వెళ్లెను. కుంభజుడు భవానీశంకరులను భక్తితో పూజించి వారికి రామకథా వృత్తాంతమును గానముచేసి వినిపించెను. అందుకు పరమేశ్వరుడు ప్రసన్నుడై ఋషికి హరిభక్తి తత్త్వమును బోధించెను. ఆశ్రమములో కొన్ని దినములు గడపిన పిమ్మట గంగాధరుడు అగస్త్యుని వద్ద సెలవు తీసుకొని దక్ష కుమారితో కలసి కైలాసమునకు పోవుచుండెను.

అదే సమయమున భూభారము నివారించుటకై రఘువంశమున అవతరించిన రామచంద్రుడు దండకారణ్యములో విచారగ్రస్తుడై తిరుగుచుండుట సదాశివుడు చూడగల్గెను. ఆ సందర్భములో, రాముని రూపంతో అవతరించియున్న విష్ణుమూర్తిని దర్శించుకొనుటకై ఉమాపతి మనస్సు ఉవ్విళ్ళూరెను.

ఇంతలో దశగ్రీవుడు మాయ లేడిని పంపుట, రామలక్ష్మణులు లేని సమయమున సీతను హరించుట, మాయలేడిని సంహరించి పర్ణశాలకు తిరిగి వచ్చిన రామలక్ష్మణులు అచట సీతను గానక దుఃఖముచే

గర ... రరాజు

# రామాయణం

విలపించుట కైలాసపతి కన్నులతో చూచెను. అప్పుడు గంగాధరుడు తనలో తానిట్లు తర్కించుకొనెను—

"భగవంతుడు ప్రచ్ఛన్నముగ అవతారమెత్తి సంచరించుచున్నాడు. సంయోగ వియోగములు లేని స్వామి మానవమాత్రునివలె విరహ దుఃఖాదులు అనుభవించి తన లీలలు లోకమునకు ప్రకటించుచున్నాడు. ఈ సందర్భమున నేను స్వామిని దర్శించిన యెడల అవతార రహస్యములు సర్వులకు వెల్లడి కాగలవు. ఆహా! రాముని చరిత్ర ఎంత విచిత్రమైనది. జ్ఞానులకు మాత్రమే భగవంతుని లీలా రహస్యములు బోధపడగలవు" అని విచారించి శివుడు—"జయ సచ్చిదానంద జగ పావన" యని ఉచ్చరించుచూ రామమూర్తికి దూరమునుండే నమస్కరించి ముందుకు సాగెను.

భవునితో కూడి పయనించుచున్న భవాని తన నాధుడు దారిలో కనబడిన ఒకానొక రాజపుత్రునికి నతశ్శిరస్కుడై నమస్కరించు చుండుట చూచి ఆశ్చర్యపడెను. ఆమె మనసులో ఇట్లు తలపోయసాగెను—

"శంకరుడు జగదీశుడు. దేవదానవ, గరుడ. గంధర్వ. నర కిన్నరులచే పూజింపబడుచున్న జగదారాధకుడు. అట్టి లోకేశ్వరుడైన మహేశుడు ఈ రాజకుమారుని సచ్చిదానంద స్వరూపుడని భావించి నమస్కరించుట చిత్రముగా నున్నది. పరబ్రహ్మ స్వరూప మిట్టిదని వేదములు సైతం వర్ణించలేదే! సర్వ వ్యాపకుడగు పరబ్రహ్మ మానవరూపమున అవతరించుట సంభవించునా! ఒకవేళ మహాజ్ఞాని విష్ణువు మనుజ రూపము ధరించిననూ ఇట్లు అజ్ఞానునివలె భార్యను వెతుకుచూ పరితపించునా!" అను పలువిధములైన సందేహములు సతి మనస్సును కలతబెట్టెను.

శివుడు సర్వాంతర్యామి కాబట్టి సతీదేవి సందేహమును పసిగట్టి ఆమె కిట్లు ప్రవచించెను—

"ఓ భవానీ! స్త్రీలు సంశయాత్మ లనుట నిజము. ఇవ్విధముగ నీవు శ్రీరాముని గురించి శంకించుట పాడిగాదు. ఎవని మహిమను ఇంతకు పూర్వము అగస్త్యుడు గానము చేసెనో, ఎవనిని నిత్యము మునులు, సిద్ధులు, యోగులు స్తుతించుచుందురో, వేదాది పురాణ గ్రంథములు ఎవని నామమహిమను వేనోళ్ల ఘోషించుచున్నవో, పరబ్రహ్మ స్వరూపుడగు ఆ రాముడు తన భక్తుల హితార్థమై రఘు కులమున అవతరించెను. ఉమా! రాముడు నాకు పూజ్యుడైన ఇష్టదేవుడు సుమా!" అని బోధించెను.

అప్పటికినీ సతికి శంకానివృత్తి కాలేదు. బలీయమగు భగవన్మాయకు లోనై దాక్షాయణి ఇవ్విధముగ సందేహించు చున్నదని భవుడు గ్రహించెను. పిమ్మట అతడు చిన్నగ నవ్వి దక్షకుమారితో ఇట్లనెను—

"సతీ! స్త్రీలు సంశయాత్ములు. నీ స్త్రీ స్వభావమునకు సత్యము బోధపడకున్నది. నీవే స్వయముగా వెళ్లి శ్రీరాముని పరీక్షించి రమ్ము. అంతవరకు నేనీ చెట్టుక్రింద కూర్చొని యుండెదను" అని చెప్పి అలికనేత్రుడు అక్కడున్న ఒక వటవృక్షము క్రిందకు వెళ్లి కూర్చొనెను. "విధి బలీయమైనది. ఈ ప్రయత్నములో సతికి ఏదో

"అమంగళము ప్రాప్తించ నున్నది." అని చింతించుచూ చంద్రమౌళి శ్రీరాముని దివ్యనామము జపించుచూ కూర్చుండెను.

ఆదిశంకరుని ఆజ్ఞానుసారము అక్కడనుండి బయలుదేరిన దాక్షాయణి రామలక్ష్మణులున్న దెసకు పోవుచూ శ్రీరాముని పరీక్షించుటకు తగిన ఉపాయము ఆలోచించసాగెను. తుదకావే సీత వేషము దాల్చి రామలక్ష్మణులు వచ్చుచున్న మార్గములో నిలబడెను.

ఉమ కుహనావేషము చూచి మొదట లక్ష్మణుడు సీత యనుకొని భ్రాంతిపడెను. కాని, సర్వజ్ఞుడగు శ్రీరామునికి సతి కపటవేషము తక్షణమే అవగత మైపోయెను. అతడు మందహాసము చేయుచూ దక్షకుమారిని సమీపించి ఆమెకు చేయెత్తి నమస్కరించి— "ఓ సతీ! కుశలమా! వృషకేతు డెక్కడ! ఈ వనాంతరమున ఇట్లు ఒంటరిగా సంచరించుటకు కారణ మే" మని ప్రశ్నించెను.

మధురముగ మరియు మర్మముగా పలికిన సీతాపతి మాటలకు సతీదేవి సిగ్గుపడెను. వెంటనే ఆమె తల వంచి దాశరథికి ఒక్క నమస్కారము చేసి అక్కడనుండి శివుని వద్దకు మరలెను.

కపటవేషమున వెళ్లి శ్రీరాముని భ్రమింప జేయ ప్రయత్నించి సతి పెద్ద అపచారము చేసెను. పరమేశ్వరునికి ఆమె ఏమి సమాధాన మీయగలదు! ఈ విచారముతో సతి మనసు కలత జెందెను. అట్లు డోలాయమానయై వెళ్లు చున్న ఉమకు తన మహిమ ప్రకటింపదలచి శ్రీరాముడు విరాట స్వరూపుడై ఆమె ఎదుట సాక్షాత్కరించెను.

హరిహర బ్రహ్మాదులు, లక్ష్మీ, సరస్వతి, పార్వతులు, త్రింశత్కోటి దేవతలు, సకల మునీంద్రులు సేవించుచుండ జనన్మంగళాకారుడైన శ్రీరాముని దివ్యస్వరూపము సతికి గోచరించెను. ఆ పరిసరములందు ఎటు చూచిననూ ఆమె దృష్టికి ఆ దివ్యరూపమే కనబడుచుండెను. ఆ మంగళ విగ్రహముయొక్క దివ్య తేజస్సుకు కన్నులు మిరుమిట్లు గొలిపి హృదయము కంపించి దక్షకుమారి స్మారకము దప్పి క్రింద పడిపోయెను. ఆమెకు తెలివి వచ్చి కన్నులు తెరచి చూచునప్పటికి అక్కడ ఏమియూ లేక యథాపూర్వముగా నుండెను. అప్పటికి ఆమె మనస్సుకు రఘూద్వహుని మహిమ చక్కగ అవగత మయ్యెను. పిమ్మట సతీదేవి సాకేతపతి సాక్షాత్కారమును సంస్మరించుకొనుచూ తిన్నగ త్రిపురారి యున్న చోటుకు వచ్చెను.

"ఏమి సతీ! కుశలమేనా! నీవు రాముని ఎట్లు పరీక్షించి వచ్చితివో నిజము చెప్పు" మని నాగభూషణుడు దక్ష కుమారిని ప్రశ్నించెను.

"మహాత్మా! మీ మాట లెన్నటికీ అసత్యములు కావు. మీరన్నంత నిజమయ్యెను. మీవలెనే నేను కూడ సీతాపతికి ప్రణమిల్లి వచ్చితిని." అని సతి పతితో నిజమాడుటకు భయపడి అబద్ధమాడెను.

## ఫాలాక్షుని ప్రతిజ్ఞ

సతీపతి సర్వజ్ఞుడు. జ్ఞానదృష్టితో ఆయన జరిగిన దంతయూ గ్రహించెను. భవాని చేసిన అపచారమునకు భర్గుడు వ్యథచెంది ఇట్లు తలపోసెను —

"విధి బలీయమైనది. జగదభిరాముని మాయకు లోనై హైమవతి నాతో అబద్ధ మాడుచున్నది. భగవదేచ్ఛను కాదనగలవారెవరు! శ్రీరాముని సన్నిధికి సీత రూపమున వెళ్లి సతి గొప్ప తప్పు చేసెను. జగన్మాత జానకి రూపు ధరించిన సతిని ఇక నేను పత్నీ భావముతో చూడడము అనుస్పర్శ యగును. కాని సతి మాత్రము పవిత్రురాలు. తెలియక చేసిన తప్పుకై ఆమెను విసర్జించుట ధర్మము కాదు. అందులకై, సతి యీ శరీరము ధరించి యున్నంతవరకు ఆమెతో నాకు గల శారీరక సంబంధము వదలిపెట్టుచున్నాను" అని ప్రమథాధిపతి తనలో తాను ప్రతిజ్ఞ చేసుకొనెను.

తదుపరి కాలకంఠుడు కాకుత్స రాముని మనస్సులో ధ్యానించి గృహోన్ముఖుడయ్యెను.

ఇంతలో ఆకాశవాణి పైనుండి "ఓ ఫాలాక్షా! నీ దృఢభక్తి శ్లాఘనీయమైనది. నీ శపథము అనన్యమైనది" అని సతీశంకరులకు వినబడునట్లు జయము పలికెను.

సతి శంకాకులితచిత్తయై భీతిగొని శివుడు ఎందులకు! ఏమి ప్రతిజ్ఞ చేసెనో చెప్పుమని ప్రార్థించెను. ఫాలాక్షుడు ప్రత్యుత్తర మీయక మిన్నకుండెను. సతికి సందేహము మరింత యెక్కువాయెను. ఇతఃపూర్వము తనవలన జరిగిపోయిన ఆ కార్యమును తలంచుకొని సతి వ్యసన కలుషిత మానసయై యిట్లు పరితపించసాగెను—

"సతులు సహజముగ అజ్ఞానులు. చాపల్య వశమున మూర్ఖురాలనై నేను చేయరాని పని చేసితిని. గంభీర శీలుడు ఉదార హృదయుడగు నాస్వామి శంకరుడు నా దోషము నాతో చెప్పుటకు వెనుకాడుచున్నాడు. అయ్యో! ఎంత ఘోరము జరిగిపోయినది! స్వామి నా చర్యను గర్హించి నన్ను పరిత్యజించినట్లున్నది." అని భవాని పరిపరివిధముల పరితపించి వ్యాకులపడెను. సతీదేవి పరివేదన పసిగట్టిన పరమేశుడు ఆమెను వూరడించుటకై ఎన్నియో చారిత్రక కథలు చెప్పుచూ కైలాసమునకు తోడ్కొని వెళ్ళెను.

కైలాసము చేరిన పిమ్మట శంభునికి తను చేసిన పూర్వ ప్రతిజ్ఞ స్మరణకు వచ్చెను. వెంటనే కాలకంఠుడు కైలాసమందున్న వటవృక్షము క్రింద పద్మాసనాసీనుడై అఖండమైన నిర్వికల్ప సమాధిలో లీనుడైపోయెను.

ఇప్పుడు సతి పరిత్యక్త. ఏకాకిని. పతి వైముఖ్యమునకు గురియైన సతీదేవి ఆత్మఘోష వర్ణింప శక్యముగాదు. ఉమ కైలాసమున ఒక దినము ఒక యుగముగా గడుపజొచ్చెను. ఆమె పశ్చాత్తాపమునకు పరిధి లేదు, ఆమె ఆత్మవేదనకు అంతము లేకుండెను. "అయ్యో! నేనెంత పాపము చేసితిని! స్వామి మాటలు అసత్యములని భ్రమించితిని, రామ మహిమను గురించి శంకించితిని, వైదేహి వేషమును ధరించి తప్పు చేసితిని. ఇప్పుడు అందుకు తగిన ఫలము అనుభవించుచున్నాను. ఇక దయామయుడైన ఆ రాముడే నన్నీ దుఃఖాబ్ధి నుండి ఉద్ధరించవలెను. ఓ జగదభిరామా! నేను విశ్వనాథుని విడిచి జీవించజాలను. ఓ రఘుపతీ! నా యీ పాపశరీరమును శీఘ్రమే తుదముట్టించుటకు మార్గము జూపి నాకు ముక్తిని ప్రసాదింపుము" అని చేతులు జోడించి సతీదేవి రాముని వేడుకొనెను.

ఈవిధముగ పరిపరి విధముల పరితపించుచూ ఉమాదేవి ఎనుబది ఏడువేల సంవత్సరముల దీర్ఘకాలము గడపెను. అప్పటికి శంభువు రామనామము జపించుచూ సమాధినుండి లేచెను. అంతట పరమశివుడు దయార్ద్రహృదయుడై దుఃఖముచే వ్యసనగ్రస్తయగు సతిని సమీపమునకు చేరదీసి అనేక భగవత్కథలతో ఆమె కాహ్లాదము కలిగించుచూ కాలమూ గడుపుచుండెను.

## దక్షయజ్ఞము

ఇదిట్లుండ, ఒకానొక దినమున బ్రహ్మలోకములో సకల మునీంద్రులు సమస్త దేవతలు సభ దీరియున్న సందర్భమున సతీదేవి తండ్రి దక్షుడు ప్రజాపతి పీఠ మలంకరించెను. అన్ని విధముల దక్షుడని భావించి పరమేష్ఠి దక్షుని ప్రజాపతులకు నాయకునిగా జేసెను.

ఇంత పెద్ద పదవి లభించగనే దక్షునిలో ఎక్కడలేని అహంకారము అంకురించెను. గర్వోద్ధతుడైన దక్ష ప్రజాపతి గొప్ప యజ్ఞముచేయ దలపెట్టి యజ్ఞ భాగములు పొందుటకు అర్హులైన సకల దేవతలకు ఆహ్వానములు పంపెను. అట్లు ఆహూతులైన దేవతలందరు సర్వాలంకార శోభితులై మహదానందముతో విమానారూఢులై దక్షయజ్ఞమునకు జనుచుండిరి.

వారివలన తన తండ్రి యజ్ఞము చేయుచున్నాడను శుభవార్త తెలుసుకొని ఉత్సాహముతో దాక్షాయణి ఉప్పొంగిపోయెను. ఈ శుభ సందర్భమున స్వగృహమునకు వెళ్లి కొలది కాలము గడిపి వచ్చిన బాగుండునని ఉమ మనస్సు ఉవ్విళ్లూరెను. తదుపరి ఆమె శివుని సమీపించి వినయురాలై పితృగృహమునకు వెళ్లి వచ్చుటకై అనుమతించవలసినదని విశ్వనాథుని వేడుకొనెను. శివు డందులకొకింత ఆలోచించి ప్రేమభావమున భవానితో ఇట్లు ప్రసంగించెను—

"సతీ! నీ కోరిక మంచిదే. నీవు తల్లిగారి ఇంటికి వెళ్లి వచ్చుట నాకు కూడ సంతోషకరమే. కానీ దక్షుడు మనకు ఆహ్వానము పంపలేదు. మీ తండ్రి మిగిలిన కుమార్తెల నందరినీ ఆహ్వానించి నామీదున్న వైర భావముచే నిన్ను పిలువక తిరస్కరించెను. నేను బ్రహ్మసభలో ఒకానొకప్పుడు అతనిని నిరాదరించితినని నాపై కినుక వహించియున్నాడు. ఆడబడుచులకు అమ్మగారింటికి వెళ్లుటకు ఆహ్వానముతో పనిలేదు. అయిననూ వైరముగల వానింటికి పిలువని పేరంటమువలె నీవు పోవుట శ్రేయస్కరముగ ఉండదు." అని కైలాసపతి హిత వొసంగెను

---

ఒక ప్రఖ్యాత హాలీవుడ్ రచయితకి తలుపు తగిలి కంటి మీద బొప్పి కట్టి, కమిలి పోయిందిట. వెంటనే ఫోటో తీయించుకుని ఒక పెద్ద డైరెక్టర్ కి పంపాడుట ఒక ఉత్తరంతో— "నా దగ్గిర నిన్ను ఎవరో తిడితే ఊరుకోను తెలుసుగా!"

ఎ కె. ఎ. (పావులూరు)

# రామాయణం

జన్మస్థలమునకు వెళ్లి అక్కడ తల్లితండ్రు లను, అక్కచెల్లెండ్రను, బంధు బాంధవులను దర్శించి రావలెనని అమిత కుతూహలముతో నున్న సతికి శివుని హితోక్తులు చెవి కెక్కలేదు. ఇక ఎక్కువ బోధించుటవలన ప్రయోజన ముండదని భార్య భావ మెరిగిన గంగాధరుడు గ్రహించెను. తదుపరి ముఖ్య గణములను తోడిచ్చి త్రిపురారి దాక్షాయణిని తండ్రి గృహమునకు పంపెను.

హోమధూమములతో మునీంద్రుల మంత్ర ధ్వనులతో ఆహూతులైన సురాసురులాది నానావాస లోకవాసులతో బంధు బాంధవులతో సకల సంరంభ సంతోషముతో లోచనోత్సవము చేయు చున్న పుట్టింటికి దక్షకుమారి వచ్చి చేరెను. ఇంటికి వచ్చిన కూతును దక్షుడు పరామర్శించ లేదు. పలుకరించలేదు, కుశలప్రశ్నలు సైతం వేయలేదు. పైగా ఆమెను చూచి అతడు ఆగ్రహో దగ్రు డయ్యెను. ఆమెను చూచినవారు దూర ముగ వైదొలగిపోయి గుసగుస లాడుకొనుచుండిరి. జరుగుచున్న పరాభవమును భరించుకొని భవాని అక్కడనుండి యజ్ఞశాలకు వెళ్లి చూచెను. అక్కడ శివుని హవిర్భాగములు కూడ ఆమెకు గోచరించలేదు. "అయ్యో! అపుడు శివుడన్న పలుకులు నిజమయ్యెనే" యని బోధపడి భవాని మనస్సు బాధపడెను. జగదీశుడగు విశ్వనాధునికి తండ్రి చేసిన అవమానమును కన్నులారా చూచి సతీదేవి హృదయము దుఃఖముచే దహించుక పోయెను. ప్రపంచములో బంధు ద్వేషమున కంటె పరాభవ మేమున్నది! పరాభవింపబడిన హైమ విహ్వలచిత్తయై అచ్చట చేరియున్న దేవతా బృందమును మునిజనమును వీక్షించి ఆక్రోశముతో ఇట్లనెను—

"ఓ మునులారా! దేవతలారా! దుర్మదాంధుడగు మా తండ్రి గర్వితుడై నా నాథుని అవమానించి నన్ను హేళన చేసెను. ఈ దౌష్ట్యమును కన్నులతో చూచి మిన్నకున్న మీరు త్వరలోనే ఇందుకు తగిన ఫలమనుభవింతురు గాక! త్రిపురారి సదా శివుడు లోకేశ్వరుడు కదా! ఆ విశ్వేశ్వరుని మా తండ్రి మూర్ఖుడై నిందించెను. నా యీ శరీరము అట్టి తండ్రి వీర్యమువలన యేర్పడినది. అందుచే నేని తుచ్ఛ శరీరమును పరిత్యజించు చున్నాను." అని చెప్పి సతీదేవి సర్వుల సమక్షంలో తన శరీరమును యోగాగ్నిచే దహింపజేసుకొనెను. దక్షాధ్వరశాల హాహాకారములతో నిండిపోయెను.

దాక్షాయణి దేహత్యాగము చేసుకొనిన సంగతి తెలిసి ఆమె వెంట వచ్చియున్న గణములు కోపోద్దీపితులై దక్షాధ్వరమును ధ్వంసము చేయ సాగిరి. కాని, భృగు మహర్షి తన మంత్ర ప్రభావముచే వారిని అడ్డుకొని యజ్ఞశాలను రక్షించెను. ఈవార్త వినిన రుద్రుడు ఆగ్రహోదగ్రుడై వీరభద్రుని పిలిచి దక్షుని యాగము విఘ్నముచేసి రమ్మని చెప్పి పంపెను. వీరభద్రుడు కాలాంతకుని వలె ప్రకోపించి దక్షాధ్వరమును తృటి కాలములో చిన్నాభిన్నముచేసి ధ్వంసము చేసెను. పిమ్మట దక్షుని, దేవతలను, మునులను, యావన్మందిని యధావిధి శిక్షించి వీరభద్రుడు వారిని దిక్కులకు పరుగెత్తు నట్లు తరిమివేసెను. (సశేషం)

ఏం జవాబు చెప్పను? "ఇక్కడ నలుగురూ పోగవుతున్నారు. అట్టా పెళ్ళి పందిట్లో మాట్లాడుకోవచ్చు రాండి'' అంటూ నెమ్మదిగా నేనూ అరూ వాళ్ళను పందింట్లోకి తెచ్చా.

మాటలు సాగుతూనే ఉన్నయి. వియ్యపురాలి చేతులు పట్టుకు "ఇవి చేతులుకావు కాళ్ళను కోమ్మా. పెద్దదాన్ని వా పరువు నిలుప''మని

## "హోరి పిడుగుల్లారా!!!

27 వ పేజీ తరువాయి

బతిమాలుతున్న బామ్మగారు "జయమ్మ! మనుమరాలి పెళ్ళి సేత్తుండవ్. నా కంత పప్పన్నం ఎయ్యవేంటి?'' అనే మాటలు విని ఉలిక్కిపడి పక్కకు చూసింది. ఇంకేముంది? వెనుకటి పోదమ్మని

చూడగానే బామ్మగారి దుఃఖమంతా కోపంగా రూపాంతరంపొంది దానిమీదికి మళ్ళింది. "ఛీ! ఫో! నీ మూలానే ఇంతా వచ్చింది. ఫో! ముందవతలికి'' అంటూ గుడ్లురిమి భీకరంగా చూసింది బామ్మగారు. ముఖం ఎర్రబడ్డది.

"ఏటమ్మ గుప్పెడన్నం పెట్టమంటే అంత కసురుకుంటావ్?'' నిర్లక్ష్యంగా అడిగేసరికి బామ్మ

గారు ఉగ్రురాలయింది. "పోతావా! మెడబెట్టి గెంటమంటావా?......" అంటూ చెయ్యెత్తింది.

"ఏందమ్మో ఎవరనుకుంటున్నవ్? మాటలు సరిగా రానీ....." అంటు గంపనేలకేసి కొట్టి, కొంగు దించి, కొప్పు విదిల్చి నిల్చింది శశి.

"ఇదేంటమ్మా శశికళ! ఈ వేషం ఏమిటి?.... ఏమిటిదంతా?......" అరుణా వాళ్ళ పిన్ని విస్తుబోయింది. ఎంత ఉగ్రంగా ఉందో అంత ఖంగు తిన్న బామ్మగారు "దీన్ని నువ్వెరుగుదువా?" అంది ఆశ్చర్యంగా చూస్తూ.

"ఉయ్యో నే నెరక్కేమండి? మా ఇంటికి వస్తూనే ఉంటుంది. అరుణా వాళ్ళ స్నేహితురాలు"

పందిట్లో నిశ్శబ్దం అలుముకుంది. అందరి చూపులూ అక్కడే కేంద్రీకరించినయి. మా శశి ధైర్యంగా బామ్మగారిముందు నిల్చి "దీని కంతా నేనే కారణమండి. మీరు ఏ శిక్ష విధించినా అనుభవించడానికి సిద్ధంగా ఉన్నాను" అంది చాలా సౌమ్యంగా. గబుక్కున నేనూ అరు దానికి చెరో ప్రక్కనా నిలబడి "బామ్మగారూ! ఒకటి రెండు ముద్దాయిలం మేము. ముందు మమ్మల్ని శిక్షించి తర్వాత దాన్నేమన్నా అనండి" అన్నాం.

బామ్మగారికి ఏమీ అర్థం కాక, "ఏమిట్రా ఇదంతా?" అన్నది అయోమయంగా చూస్తూ.

ఈమధ్య ఏర్పడ్డ చనువును పురస్కరించుకొని నేనే ధైర్యంగా "అసలు విషయం బామ్మగారూ లక్ష్మి గోపీ ఒకర్నొకరు ప్రాణంగా ప్రేమించుకున్నారు. గోపీనితప్ప పెళ్ళి చేసుకోనని లక్ష్మి చెప్పింది. మీరు మీ మనమడి కివ్వాలనుకోగానే తను ప్రాణ త్యాగమైనా చేస్తానుగాని గోపీనితప్ప ఇంకెవ్వరినీ పెళ్ళి చేసుకోనని ఖచ్చితంగా చెప్పేసింది. లక్ష్మిమీదున్న అభిమానంకొద్దీ ఈ పెళ్ళి ఎలాగైనా తప్పించాలని శశిచేత సోదమ్మి వేషం వేయించి ఈ నాటకం ఆడాము. అంతేగాని దాని జాతకంగాని, ఏవీ మాకు తెలియవు. లక్ష్మి ప్రాణం కాపాడడానికే ఇదంతా చేశాం. మా తప్పుకు మమ్మల్ని శిక్షించండి. మీ ఇష్టం వచ్చిన వాళ్ళకు మీ పిల్ల నిచ్చుకోండి" అని నేను చెబుతున్నంతలో ఆడుకుంటున్న మా చెల్లివచ్చి "అక్కయ్యా! ఎక్కడో చూసినట్లుందని ఆనాడే నే ననలేదుటే" అంది డి. డబ్ల్యు. నెం. 1 గా.

"ఎవరో ఫ్రెండ్‌ని తమాషా చెయ్యాలని అంతా వేషం వేసింది ఇందుకటే?" ఆ పేటలోనే ఉంటున్న శశి వాళ్ళ చుట్టాలావిడ శశిని అడిగింది డి. డబ్ల్యు. నెం. 2 గా.

"ఈ బొందిలో ప్రాణం ఉండగా గోపీ బావను తప్ప మరెవ్వరినీ చేసుకోను" తలుపుచాటునుండి అనేసింది లక్ష్మి నిర్భయంగా.

"అయితే లక్ష్మితో పెళ్ళవుతుంది. లేదా నేనూ యావజ్జీవితం బ్రహ్మచారిగానే ఉండిపోదలుచుకున్నాను" అని తన నిశ్చయాన్ని తెలియజేశాడు తాపీగా తలొంచుకు కుర్చీలో కూర్చున్న పెళ్ళికొడుకు గోపీనాథ్.

"హారి పిడుగుల్లారా!!!" కళ్ళు ఇంతవిచేసి గుండ్రంగా త్రిప్పుతూ ముక్కు మీద వేలేసుకుంది బామ్మగారు. ముడతలుబడ్డ ఆ ముఖంలో మొదట ఆశ్చర్యం ఆ తర్వాత దాన్ని తరిమేసి చిన్న మందహాసం చోటు చేసుకున్నవి. "సరే కానీండి. ఇంత దూరం వచ్చాక అందరం అక్షింతలు వేద్దాం" అన్నది నలుగుర్నీ చూస్తూ సంతృప్తిగా.

"తథాస్తు!!" అన్నారు పందిట్లో పెద్దలంతా.

పెళ్ళి పెద్దలం మేము ముగ్గురమేనని వేరే చెప్పాలా?.... ★

# ప్రేమ

వీరాజీ

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయుని చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానకమ్మగారు, అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ; కూతురు వసంతకూ ఒకేసారి వివాహం చేయాలని ఆమె తిరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్ళిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది. పెళ్ళికూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది. ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది. తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం; ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరకి భాస్కరం తన పెళ్ళి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం. ఏ లో చేర్తారు. భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి వస్తాడు. సురేఖ అంతా చెప్పిఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు. భాస్కరం కాని చెప్పలేక పోయాడు. వసంత పెళ్లి జరుగుతోంది. అక్కడ సురేఖను ధనమ్మగారు జానికమ్మగారి కోడలు అని చెప్పుండి పద్మావతి హతాశయై వెళ్లిపోతుంది.

## 43

సుబ్బారావుగారికి ఒక బాధ్యత నెత్తినించి దింపుకున్నానున్న తృప్తితోపాటు హృదయం తేలికగా ఉన్నది కూడాను. జానికమ్మగారు అల్లుణ్ణి కూతుర్ని చూసుకుని మురిసిపోయింది. ఆమెకి కించిత్ గర్వంగా ఉంది కూడాను. ఇక గర్వి, పురానా అయిన ధనమ్మగారితో వియ్యమందితేనా?...... ఐతే "ఈ భాసడు వసంత పెళ్ళి అయిపోయినా చెరువు చేసినట్లు దిగులుగా ఉన్నాడేం?" అన్న అనుమానం ఆమెకు కలిగింది.

"ఒహో చెల్లెలు పరాయిదై పోయిందే" నన్న వ్యథయేమో ననుకున్నదామె.

భాస్కరం తిరిగి తిరిగి వచ్చి సురేఖ కోసరం వెతుక్కున్నాడు. తను ఏ ప్రేమనైతే పవిత్రంగా అతి రహస్యంగా భద్రపరుస్తున్నాడో అది ఇవాళ నడి రోడ్లపాలై అవమానానికి అనుమానానికి మాత్రం దారి తీస్తుందేమోనని భయం.

సురేఖ, భాస్కరానికి అగుపించలేదు. పిన్ని నడిగితే కథ మరో మార్గాన పట్టిపోడానికి తానే కారకుడవుతాడన్నమాట. ధనమ్మగారిని అడగటం ఇంకా ముప్పు!

సురేఖకు శిరోభారంగా ఉన్నందున తన గదిలో మంచంమీద పడుకున్నది. అలా పడుకున్నదల్లా మధ్యాహ్నం జరిగిన సంఘటనలను తీవ్రంగా ఆలోచించింది. పరిస్థితుల దుర్భరత ముందు ఆపిల్ల తెలివి తేటలు వీగిపోయాయి. ధనమ్మగారు వచ్చి "ఏమ్మాయీ!" అని ప్రక్కన కూచుని నుదుట చెయ్యివేసేసరికి "చుర్"మని కాలింది. "అమ్మయ్యో! జ్వరం" ధనమ్మగారి గుండెల్లో రాయి పడ్డది.

"దిష్టి తగిలింది" అనుకున్నదామె. ఏమైనా సురేఖకు జ్వరం తీవ్రంగా కాస్తున్నది. పెళ్లైన సంబరంతో ఉన్న వాళ్ళందరిమధ్య సురేఖకు జ్వరం అని చెప్పడం "ఓగాయిత్య" మనిపించింది. ధనమ్మగారికి. "స్పైగా మగ పిల్లడి వంకవారు వంకలు పెట్టడంలో బహు నేర్పరులు" అనుకుంది.

భాస్కరం తాను చాలా సమర్థవంతుణ్ణి అనుకుంటూ వచ్చాడుకాని, ఇప్పుడు 'మూర్ఖుణ్ణి' అనే విషయం గ్రహించాడు.

సురేఖను చూడాలన్న ప్రయత్నం—పద్మావతి గురించి వాళ్తేరులో కనుక్కోవాలీ అన్న తహతహ ఎక్కువయ్యాయి.

వసంతకు పెళ్ళికూతురి బిడియం కాస్త తగ్గింది. ముకుందరావును సోగ కనులెత్తి చూసింది. నవ్వింది. సిగ్గుపడ్డది. అన్నయ్యకు వంగి దండం పెట్టి లేచి కన్నీళ్ళు నింపుకుంది.

"గృహప్రవేశం" లాంఛనంగా చేసినప్పుడు జానకమ్మగారు సురేఖ గురించి అడిగింది.

"కాస్త మంచు పడింది నిన్నరాత్రి ఆరు బయట పడుకున్నది. పడిసం పట్టింది" అన్నది ధన్నమ్మగారు. కాని సురేఖకు ఆమె డాక్టర్‌ను పిలిచి ఇంజెక్షన్ ఇప్పించింది!

వసంత సురేఖ దగ్గిరకు వెళ్ళింది. సురేఖకు ఉష్ణం తీవ్రంగా ఉంది. వసంత మెల్లిగా నీర్సంగా అడుగులో అడుగు వేస్తూ వెళ్ళి పక్కమీద కూచుంది

"సురేఖగారూ!"

"............"

"మీకు ఇప్పు డెలా ఉంది సురేఖగారూ!"

సురేఖ మూలుగుతున్నది. తన చెయ్యి మెల్లిగా ఆమె నుదుట పెట్టింది వసంత.

"మరుగుతున్నది"

సురేఖకు ఈ కొత్త స్పర్శతో కాస్త మగత విడి "ఎ....వ....రూ.....?" అన్నది కనులు బలవంతంగా బరువుగా తెరుస్తూ.

"నేనూ......'

"ఆ.....? పెళ్ళికూతురా?......" సురేఖ బరువుగా కనులు తెరిచింది.

"మీరు.......మీకు.......మీ......" వసంతకు ఏమనాలో తెలియదు.

వసంత కోసరం అన్నట్లు భాస్కరం వచ్చాడు ఆవెనకాతలే.

"జ్వరం వచ్చిందా?......" అన్నాడు కాస్త ఎడంగా నిలబడి.

"చాలా ఎక్కువగా ఉందన్నయ్యా!" వసంత సురేఖ పైటను సరిగ్గా సర్దుతూ చెప్పింది.

డాక్టర్‌ను పిలుద్దునా? అనుకున్న భాస్కరం—ప్రక్కనే వున్న స్టూలుమీద మందుసీసా, అవీ చూసి డాక్టర్ వచ్చి వెళ్లాడని గ్రహించాడు.

"నువ్వు పద తల్లీ......అమ్మ పిలుస్తోంది" అన్నాడు వసంత మద్దేశించి.

"సురేఖగారిని మన డాక్టరు రాజశేఖరంగారికి చూపించాలన్నాయ్!" వసంతలేచి కదిలింది ఆ విషయమే అమ్మకి కూడా చెప్పాలనుకొని.

సురేఖ హీనపక్ష చందమామలా ఉన్నది.

"నన్ను క్షమించండి!" భాస్కరం నెమ్మదిగా ఒంగి అన్నాడు.

సురేఖ చెయ్యి బరువుగా ఎత్తి వూపి వారించింది!

"పద్మావతి వాల్తేరు వెళ్ళిందిట" అన్నాడు.

"నిజంగానా? సరే" అన్నట్లు కాస్త చైతన్యయుతంగా ఆమె అతనికేసి చూసింది.

జానికమ్మగారికి ఇదంతా ఏదో దేవతల ఆగ్రహం అనిపించింది. సురేఖ మొన్నటిదాకా నిక్షేపంలా తిరుగుతున్నది. ఇప్పుడు మంచమెక్కిందీ అంటే నమ్మశక్యమా?

వసంతకు పెద్దరికం చాలా వచ్చింది.

భాస్కరంమూర్తికి టెలిగ్రాం ఇచ్చాడు. మూర్తి సమాధానం ఇచ్చాడు. పద్మావతి మరో 'కళ్ళజోడు' పెద్దమనిషితో బస్సు దగ్గర నిరీక్షిస్తూ అగుపించినదనీ, శైలజను తాను కల్సుకోలేక పోయినందున మరే వివరాలు రాయలేననీ, ఎక్స్‌ప్రెస్ ఉత్తరం రాశాడు మూర్తి.



"నేను మీరూ కలిసే వెళ్దాం కాలేజీకి" అన్నాడు......

"ఉహూ.........నాకు మరో వారం పడుతుందిగా.......మీరు వెళ్ళండి"

"నో....నో....మీరు నా చదువుకోసం వెంటనే నయమైపోవాలి" భాస్కరం లాలనగా చనువుగా వాత్సల్యంగా అన్నాడు.

"ఎంత స్వార్థం" సురేఖ పెదాలు చిరుహాసంగా విడ్డాయి.

ఫెళ్ళున లెంపకాయ కొట్టినట్లనిపించింది భాస్కరానికి.

"అమ్మయ్య!" అనుకున్నాడు ఉత్సాహం పుంజుకున్నాడు భాస్కరం.

సురేఖకు బహు సున్నితమైన మనసు ఉన్నది. మెత్తని సౌశీల్యమున్నది. అదే కారణం జ్వరానికి. ఆ సంగతీ భాస్కరానికి బాగా తెలుసు.

*   *   *

జానికమ్మగారు ఆమె బరువు బాధ్యతలతో సతమత మవుతున్నది.

కూతురిచేత వ్రతాలు నోములు చేయించాలి. అత్తవారింటికి దిగబెట్టాలి. మళ్లీ పుట్టినింటికి తేవాలి. అల్లుణ్ణి పిలవాలి. సాగనంపాలి. ఇవన్నీ సంప్రదాయాలు ఆమె 'నెత్తిన హైరానయేగదా!'

వసంతకు కొత్త ప్రపంచంలో అడుగు పెట్టినట్లు, తన శరీరమంతా ఇప్పుడే ఎవరో తెచ్చిన కొత్త తొడుగులాగ ఉన్నది!

ముకుందరావుకు అప్పుడే తండ్రి దర్పమూ అధికారమూ, తను భరించలేనివీ అనిపించసాగాయి.

"బెట్టు తెలియదురా నీకూ...... పెళ్లాంమీద అంత ప్రేమ ఇప్పుడే చూపిస్తే ముస్ముందు అది నీ నెత్తిన ఎక్కి పిండి కొడుతుందీ" అన్నాడు రాఘవేంద్రంరావుగారు.

ముకుందరావుకు కష్టమనిపించింది.

"నాకు శలవైపోయింది. డ్యూటీకి ఎల్లుండే వెళ్లాలి" అని విసురుగా తండ్రి ఎదుటనించి లేచి వెళ్ళిపోయాడు.

*   *   *

కొడుకు తిరిగి వాల్తేరు వెళ్తానన్నప్పుడుగాని జానికమ్మగారికి 'పద్మావతి' గురించి అడగడం గురుకు రాలేదు.

"ఆవేళ ఎవరో ఒకమ్మాయి రైలుకి వెళ్ళింది కదురా?" అన్నదామె.

"ఆఁ వెళ్ళింది. రైలుకన్నా ముందే వెళ్ళింది"

"అదేమిటి బాసా?"

"ఏంలేదుపిన్నీ—పాపం అర్జెంటు పనులున్నాయి కదూ—అలా పారిపోయానని నీకూ నాన్నగారికీ క్షమాపణ జెప్పమనీ రాసింది" అన్నాడు భాస్కరం నవ్వు తెచ్చుకుని.

"అలాగా? ఉత్తరం రాసిందా నీకు?" ఆమెకు అంతలోనే ఆందోళన.

"రాసింది."

భాస్కరం ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు, పెట్టె సర్దుకోడం నటించాడు.

జానికమ్మగారు తిరిగివచ్చి చెప్పింది.

"వాళ్ల సురేఖకు వూష్ణం పోయింది—నిన్న పత్యం పెట్టారు ఆ పిల్లను సాయంగా తీసుకు వెళ్దువుగాని—ఇవాళ పంచమి—రేపులేదు ఎల్లుండి సప్తమినాడు—ఉండరాదూ?"—

"పత్యం పెట్టిన రెండు రోజులికే ఎందుకమ్మా? కాస్త 'రెస్టు' తీసుకో నిమ్మనూ" భాస్కరం ఆ వార్త పట్ల ప్రసన్నతను వ్యక్తపరుస్తూ అన్నాడు.

"నిమ్మళంగా ఉందిట— పాఠాలు పోతాయి వెళ్తానంటున్నదని ధనమ్మగా రంటోంది."

"సరే! నీ ఇష్టం!"

భాస్కరంపట్ల జానికమ్మగారికి వెంటనే వాత్స ల్యం పొంగి వచ్చింది.

దగ్గరిగావచ్చి "బంగారుకొండ" అని తల నిమిరి గొణిగి, గబగబా వెళ్ళిపోయింది.

భాస్కరాన్ని ఎవరో ఏళ్ళ చెక్రాల మరలో పెట్టి నలుపుతున్నారనిపించింది.

# 44

రాజు, పద్మావతిని "అమ్మాయ్! పిన్నమ్మ ఎలాగా సినిమాకురాదు. నువ్వేనావస్తే— ఓ మంచి సినీమా చూద్దామనుకుంటున్నాను" అన్నాడు.

రాజు పక్కంగానే జయమ్మగారు కూడా మాటా డింది. "చనువు లేక గాని. లేకపోతే అదే నిన్ను సినీమాకి అడగవల్సిన మాట" అన్నది ఆమె.

"నిజంగా పార్వతి అయితే ప్రాణాలు కొరికే స్తుందనుకో......దానికి ఈమధ్య హిందీ సిన్మాల పిచ్చి కూడా ఎక్కువయింది" అన్నాడు రాజు.

చెట్టంత మనిషిని ఎదుట చూస్తూ "కాదు" అని ఎలా అనాలో తెలియలేదు పద్మావతికి. పైగా తను ఎంత కాదనుకున్నా లోపల లోపల, తనకూ, ఒక ప్రతిపత్తి, ప్రతిష్ఠగల అన్నయ్య ఉన్నాడన్న చిన్న ధీమా కూడా తల ఎత్తింది.

రాజు చాలా సర్దాగా మాట్లాడ సాగాడు.

"ఇంకా మీ యూనివర్శిటీలో క్లాసు రాదనో, మార్కులు తక్కువేస్తారనో భయపడతారుగాని కాలేజీల్లో స్టూడెంట్సు బొత్తిగా మాట విన రనుకో" అన్నాడు. అని తన అసమర్థతను బయట పెట్టుకోడం ఇష్టంలేక "నన్ను చూస్తే చాలా రెస్పెక్ట్—బోలెడు గౌరవం ఇస్తారులే" అన్నాడు.

"పార్వతిని ఇక్కడకు పంపితే నాలుగు రోజులు సరదాగా గడుపుతాం" అన్నది పద్మావతి.

"నాకు ఇప్పుడు నాగపూర్‌లో పని చేస్తున్న మిత్రు డొక్క డున్నాడు......నిజంగా ఎంత మంచి వాడనుకున్నావ్?" అని సమాధానంగా అన్నాడు రాజు.

అతని మంచితనంతో తనకేమీ ప్రమేయం లేదు గనుక పద్మావతి మాట మార్చిందికా అన్నట్లు, "మరి పార్వతికి సంగీతం చెప్పిస్తున్నారా?" అనడి గింది. రాజుకీ ప్రశ్న అస్సలు కిట్టలేదని అతని మొహమే చెపుతోంది. "అతను అంటే మా నాగ పూరు స్నేహితుడు చెదరంగం అంటే చెవి కోసు కునేవాడు—వాడు నేనూ ఒక్కోసారి తెల్లార్లూ ఆడి, కోడి కూశాక పడుక్కునే వాళ్లం"

పద్మావతికి ఆ మిత్రుడు గురించి వినాలన్న కుతూహలంలేదు. భాస్కరానికి కూడా "చదరంగం మహా ఇష్టం" అని చెప్దామనుకుంది చిరాకుగా కాని.

"నాకు చదరంగం రాద"ని మాత్రం అన్నది. రాజు నవ్వాడు. "మంచిదే! లేకపోతే పూర్తిగా స్టడీస్ దెబ్బతింటాయ్!" అన్నాడు.

అంతలో సినీమా హాలు వచ్చింది. దర్జాగావెళ్ళి చెల్లెలంటే తన కెంత అభిమానమో తెలియ జేయడానికా అన్నట్లు రెండు పై తరగతి టిక్కె ట్‌లు తెచ్చాడు.

"అమ్మాయ్! కాఫీ తాగుతావా?" అన్నాడు.

"వద్దు" వినయంగా తల తప్పింది పద్మా వతి.

హాలులో జనం పల్చ పల్చగా ఉన్నారు. పద్మావతికీ సర్దాగా లేదు. మళ్ళీ రాజు చెప్పడం ప్రారంభించాడు.

"మా వాడిపేరు జనార్దనం....ఎమ్మే ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. వాడిదీ నాదీ ఒకటే బేచ్. అయితే వాడు చాలా తొందరపాటు మనిషి...... గుంటూరులో ప్రిన్సిపాల్‌తో కాట్లాడి రిజైన్ చేశాడు . . . ప్చ్."

పద్మావతికి ఒళ్లంతా చీమలు ప్రాకుతున్న ట్లుంది. పెద్దవాడు అన్నయ్య— పరాయివాడు కూడాకాదు. ఎవరో రంగధామయ్య గురించి ఇలా తన ముందు పూదరకొడితే, దాని నుంచి ఎలా తప్పించుకోవాలో తెలియకపోవడంతో "నువ్వు కాఫీ తాగిరా అన్నయ్యా కావాలంటే ?" అన్నది.

"అదిసరే ! నాకు కాఫీ పెద్ద అలవాటు లేదు. ఐనా రెండు కాఫీ తెప్పిస్తానుండు"— అన్నాడు.

పద్మావతి వారించలేదు. కణతలు నొక్కు కుందామని "ఎంతైనా పెద్దవాడు విసిగిస్తున్నా వని" చెప్పడం బాగుండదని వూరుకుంది.

రాజు ఆ సినిమా పూర్తయ్యేలోగా జనార్ధనం గురించి చాలా చెప్పాడు. వాళ్లకి ఒక ఇల్లు కాస్త చెప్పుకోదగ్గ పొలమూ ఉంది. మంచి సంప్రదాయం వాళ్ల నాన్నగారు ప్లీడర్ గుమాస్తా అయినా మంచి "పేరు" మన్నినా బడసినవాడు. ఒక్కడే కొడుకు జనార్ధనం— అదీ ఐదుగురాడపిల్లల తర్వాత కలిగినవాడు. అన్నింటికన్నా ముఖ్యమైన సంగతి "ప్రస్తుతం హొటలు "కూడు" తిన లేక ఇబ్బంది పడుతున్నాడు." అని చెప్పాడు.

పద్మావతికి ఈ వ్యవహారం కొంతలో కొంత అర్థమైంది. అందుకనే పదేసదిసార్లు "నాకు ఈ ఎమ్మే ఎలాగైనా పూర్తి చెయ్యాలనున్నది" అంటూ రాజుకు చెప్పింది.

రాజు మాత్రం జనార్ధనం గురించి చెప్పడం మానలేదు. చివరికి అసలు సంగతి కూడా ఇంచు మించు బయట పెట్టాడు.

"వాడికి మన పార్వతినే ఇచ్చేద్దును గాని బొత్తిగా వయస్సు తక్కువేమో కాస్త ఎబ్బె ట్టుగా ఉంటుందేమోనని యోచిస్తున్నాను" అన్నాడు.

"అసలు ఆ మాటే పిన్నిని సలహా అడిగితే ఆవిడ కూడా మరీ అంత వయస్సులో వార ఉండకూడ దన్నది" అన్నాడు రాజు.

పద్మావతికి కొంచెం కొంచెంగా తన నెవరో నమి లేస్తున్నట్లుంది. "ఇంతకీ ఏం చెయ్యమంటావు ?" అన్నట్లు చూసింది. ఇంటర్‌వల్ దీపాలకాంతిలో



# ప్రేమకు పగ్గాలు

ఆ భావం స్పష్టంగా రాజు గ్రహించాడు కూడాను.

"నాగపూర్‌లో మ్యాటర్‌మీద జంటలు ఇంచక్కా వెళ్తారమ్మాయ్ ! ఇక్కడ మన వూళ్లల్లో ఇంకా అంత 'సివిలిజేషన్' రాలేదు గాని...." అన్నాడు

"అదా ? నాగరికత ?" అని కూడా అడగ లేదు పద్మావతి.

పద్మావతికి రాజు "పన్నాగం" పూర్తిగా అర్థ మయిపోయింది. ఆ రాత్రి ఆ పిల్లకి అన్నం సయించలేదు. నిద్రపట్టలేదు. కనీసం ఆ సాయం కాలం చూసిన సినిమా ఐనా నెమరువేసుకుందా మంటే, సినిమా చూస్తున్నంతసేపూ తెరమీద బొమ్మలు అలుక్కుపోయినట్లు అగుపించేయేమో, ఇంత పిసరు జ్ఞాపకం రావడంలేదు.

ఎంత కాదనుకున్నా భాస్కరం— సురేఖ— వసంతపెళ్లి, ధనమ్మగారు, జానికమ్మగారు, గతం పిక్‌నిక్, ప్రేమా ఇవే జ్ఞాపకం వస్తున్నాయి !

రాజు అకస్మాత్తుగా వచ్చి తనకు పెళ్లి సంబం ధాలు తెస్తాననడం కన్నా, జయమ్మగారు రాజు మాటలకు ఇస్తున్న గౌరవం, పద్మావతి మనసులో బాధ కలిగించింది.

"ఇన్నాళ్లూ లేని ప్రేమ ఇవాళ ఒలకబోస్తున్న యితగాడిమీద అమ్మకు ఇంత అభిమానం సదభిప్రాయం కలగడం కూడా నాకర్మే" అను కుంది.

"అంతగా బాసచేసుకున్న భాస్కరం ప్రేమకే విలువా, నిలకడా లేనప్పుడూ, ఈ బంధు ప్రేమలు ఎక్కడి మాటలు ?" అనుకుంది.

భాస్కరం గారిని పెళ్లాడకపోతే సముద్రంలో పడిపోతా ననుకుంది ఒకసారి గుంటూరులో ఉన్నప్పుడు కాని ఇప్పుడు 'భాస్కరంగారు తన వాడుకాదు'— జయమ్మగారూ, ధనమ్మగారూ, స్పష్టంగా తన చెవులబడి గుండెల్లో దూరి పేల్చేటట్లు ఆ మాటలనుకున్నారు. తాను విన్నది.

"హూ!... మా అమ్మాయి పెళ్లికి వస్తావు కదూ ? అన్నదా లావుపాటి ధనమ్మగారు ! ! ! వస్తా.... వస్తా.... నెందుకురానూ ?...." బాధగా కసిగా ధనమ్మ రూపాన్ని వూహించి మరీ అసహ్యించు కుంది బాధ పడింది.

'కాని తను భాస్కరాన్ని ప్రేమిస్తున్నదా ?' అన్న మాట లెవరో అడిగినట్లు వినిపించింది.

"ఆహా !.... ప్రేమిస్తున్నాను." అన్నది తనలో తనే సమాధాన పరుచుకున్నట్లు.

"అయితే సముద్రంలో పడి ఇంకా చావలేదేం.?!" — పద్మావతిలేచి కూచుంది.

గోడనున్న "బెడ్‌లైట్" సన్నగా వెలుగు తున్నది. రాజు అవతలి గదిలో గుర్రు పెడు తున్నాడు. సుమారు రెండు మూడు గంటలసేపు, జయమ్మగారు రాజూ, అత్యవసరంగా అనేక విషయాలు మాట్లాడుకున్నరు. అలసిపోయినట్లు న్నాడు బాగా హాయిగా నిద్రపోతున్నాడు రాజు.

ఐతే జయమ్మగారికి అలసటకన్నా నిద్రకన్నా కూతురి ధ్యాసయే ఎక్కువైనది. "ఏమే ! మంచి నీళ్లు కావాలా ?" ఆమె లేవబోతూ అడి గింది.

"అక్కర్లేదమ్మా" వెంటనే పడుకుంది. పద్మావతి.

"తాను సముద్రంలో పడిపోతే.... జయమ్మగారేం చేస్తుందో ?...."

"అమ్మో ! అమ్మ బ్రతికుండగా నేనేమీ ఇలాంటిపని చెయ్యలేను...."— పద్మావతి దుప్పటి కప్పేసుకుంది—

"నిద్రలో కూడా కూతురికి దాహమే వేస్తున్నదో, భయమే కలుగుతున్నదోనని ఆందోళన పడిపోయే ఇలాంటి అమ్మ ఉండగా.... నేను నిస్సహాయంగా దుఃఖ పడడమేం కర్మ" అనుకుంది.

"భాస్కరం గారిని కూడా ఇలా ప్రేమించగల వాళ్ళుంటేగాని అతనికి ప్రేమ విలువ తెలిసి వచ్చేది కాదనిపించింది. కాని భాస్కరానికి జానకమ్మ సవతితల్లికదా ?.... అందుకనే అతగాడికి ప్రేమ ఒక బంధనంగా అనుభవంలోకి రాలేదనుకుంది పద్మావతి— పద్మావతికి జానకమ్మ గురించి అస్సలు తెలియదు— భాస్కరం చెప్పిన మాటలు అన్నీ ఇవాళ అబద్ధాలే ఆ పిల్ల దృష్టిలో....

పద్మావతికి తన జీవితం తన కళ్ళముందు పెరిగి మొగ్గ తొడిగి పూలు పూయకుండా, వాడి మాడి రాలిపోతున్న మొక్కలా అనిపించింది బోర్లా పడుక్కుంది. దుఃఖ మాగలేదు.

* * *

జయమ్మగారికి కూడా మనసు ఆందోళనతో నిండిపోయింది — రాజు మీద ఆమెకు ప్రత్యేకించి అప్యాయత ఏమీ లేదు. కాని రాజు రావడం — రాజు తను మాట్లాడడం ఇత్యాదులన్నీ ఆమెకు సామాజిక ప్రపత్తికి, తన వ్యక్తిగతమైన ప్రతిష్ఠకూ చెందినవి — "తను రెండో పెళ్ళి వాణ్ని చేసుకున్నందుకు ఇవాళ ఏకాకినై పోయాను" అనిపించడం కన్నా, సవతి బిడ్డలే అయినా, రాజువంటి హోదా, స్థాయిగల వాళ్ళు రావడం 'పిన్నీ' అని పిలవడం ఆమెకు దేవుణ్ణి "కోరగా ఇచ్చిన వరాలకుమల్లే" అనిపిస్తాయి.

"ఆయన కన్ను మూయగానే అన్ని రకాల ఉనికి ప్రతిపత్తులు మాయమయ్యాయనుకున్న నాకు, ఈ పద్మావతిని వదలిపోయారు— లేకపోతేనా ? నేను కూడా మీ నాన్నగారితోనే...." అని ఆమె రాజుతో భోజనాల దగ్గర మాటల సందర్భంలో అన్నది.

"ఎంతమాట ! అన్నాను పిన్నీ ? నాన్నగారు మీకు ఒక్క పద్మావతినేనా వదలి పోయారు ? అని రాజు నొచ్చుకున్నాడు "ఛీ ఛీ! ఇంత ఎరుసు చేస్తావనుకోలేదు మమ్మల్ని" అన్నాడు చెయ్యి కంచంలో విదిలించి— ఆమె బ్రతిమాలింది గనుక కాని, లేకపోతే "చెయ్యి కడిగేసుకొనేవాడు కూడా !"

జయమ్మగారికి కావల్సినదదే ! రాజు మాటలలో భేషజమే ఎక్కువపాళ్ళుండుగాక, ఆమెకు అక్కర్లేదది ! పద్మావతికి శిష్ట సమాజంలో చోటు "తండ్రి తరఫునించి" అతని కడుపున పుట్టిన బిడ్డలనుంచీ, రావాల్సిందే ! అందుకు మొదటి యత్నం తుది ప్రయత్నం కూడా ఆమె దృష్టిలో— సవతి బిడ్డలతో తాను పూర్తి సంబంధ బాంధవ్యం నెరపడమే !

"ఇవాళ ఇంక పద్మావతికి దిక్కులేదన్న బెంగ లేదు. దానికి అన్నలున్నారు. చెల్లెలుంది. హోదా ఉన్నది, సామాజిక స్థాయి ఉంటుంది" అనుకున్నదామె.

రాజు ఆమెతో ప్రస్తావించిన సంబంధం "పూర్తిగా మంచిదేనా ?" అన్న సంకోచం ఒకవేపు పీడిస్తూ ఉన్నా ఆమెలో సంకోచం రెండోవైపు "ఎందుక్కాకూడదూ ?" అనే ఆశ కూడా పొడసూపుతున్నది.

"ఐనా పైనెల ఇక్కడికి కుర్రవాణ్ణి తీసుకొస్తాడుగా చూశాక నాలూగూ అవే తెలుస్తాయి" అనుకుందామె.

రాజు "జనార్ధనం" గురించి చెప్పిన అన్నీ ఆవిడకు బాగున్నాయి గాని ఆఖరి మాటగా రాజు చెప్పిన ఒక్క విషయం మాత్రం ఆమెకు ఎదలో ములుకై పొడుస్తున్నది.

రాజు చెప్పాడు "జనార్ధనం నాకన్నా కొంత చిన్నవాడే ననుకుంటాను .... అతనికి పాతికెకరాల మాగాణితో ఇరవయ్యోఏట పెళ్ళైంది. కాని కర్మవశాత్తు ఆ అమ్మాయి, ఇల్లు కాలిన ప్రమాదంలో వాళ్ళ వూళ్ళోనే మరణించింది...."

"ఇంత అల్లారు ముద్దుగా పెంచి, చదువు చెప్పించి, ద్వితీయం ఇవ్వమంటావా ? రాజా !" అన్నదామె శూలంతో పొడిచినట్లు బాధపడుతూ.

"అదేమిటమ్మా ? అలా అంటావ్ ? .... ఆ అమ్మాయికి ఇరవై ఏళ్ళు కూడా ఉండేవికావట? చిన్న తనంలోనే దైవికంగా జరిగిన దానికీ, అతని వయస్సుకీ ఎలా ముడిపెడ్తావు ? చెబుతున్నానుగా.... నాకంటే చిన్నవాడనీ...." అన్నాడు రాజు.

"వయస్సు గురించి కాదు బాబూ నా బాధ...." అన్నదామె.

"మరి గారాబం విషయంలోనా ? సుఖంలోనా? ఇలాంటి విషయాలలో మన పిల్లకి తక్కువ చేస్తాడనా ?" రాజు రెట్టించి మరీ వాదించాడు. "ఆ బెంగ నీకు వద్దు ? జనార్ధనం నా ప్రాణ స్నేహితుడు .... చదరంగంకన్నా వ్యసనం గానీ, నల్లుల్ని చంపడంగన్నా హింసాయుత కాండగాని అతనికి అంట గట్టడం ద్రోహం అనుకో" అన్నాడు.

పైగా రాజు నేరుగా జయమ్మగారినే ఉదాహరణ పాలుజేశాడు.

"నాన్నగారికన్నా నువ్వు ఎంతో చిన్నదానివి— మేం పుట్టాకా, మా అమ్మ ఉండగా ఆయన నిన్ను పెళ్ళి చేసుకుని పువ్వుల్లో పెట్టి చూసుకో లేదా ?" అని అడిగాడు.

జయమ్మగారు మాటాడలేదు.

"చాలా రాత్రైంది. పడుక్కో బాబూ ? నీవు అన్నీ తెలిసిన వాడవు నీమాటే కానిద్దాము" అన్నది బలవంతంగా ఎవరో అనిపిస్తున్నట్లు ! "దేనికైనా దైవేచ్ఛ కావాలి కదా ?" అని కూడా చెప్పింది.

రాజుమాత్రం ఆమెను జనార్ధనం గురించి ఒప్పించడానికి దైవేచ్ఛగన్నా తన ప్రయత్నమే అవసరమని గ్రహించాడు.

"మనం పద్మావతికి అతగాడు ఇదివరకు ఒకసారి పెళ్ళి చేసుకున్నాడు అని చెప్పనే వద్దు" అన్నాడు.

జయమ్మగారికి "తాను కూతురికి వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నానా ?" అన్న మాట కూడా తోచక పోలేదుగాని ఆమె నిస్సహాయత అలాంటిది.

రాజు మాటలకు "అలాగే" నన్నది ఆమె.

ఆ రాత్రి తెల్లార్లూ రాజు గుర్రును జయమ్మగారు విన్నది. పద్మావతీ విన్నది. గాని ఒకరికొకరు నిద్రపోలేదన్న విషయం మాత్రం పద్మావతీ జయమ్మగారూ ఇద్దరూ తెలియనివ్వలేదు.

మర్నాడు ఉదయం రాజు తన పథకానికి ప్రాతిపదిక పూర్తి అయిందన్న ధీమాతో వెళ్ళిపోయాడు. పద్మావతిని "స్టేషనుకు వస్తావా ? ఏమ్మే చదువుకుంటున్న చెల్లాయ్‌వికదా ? నా కదో గొప్ప—" అన్నాడు.

పద్మావతి మాట్లాడలేదు. తలదించుకుంది.

జయమ్మగారు "పార్వతినైతే ఇలా అడుగుతావా?" అని లోలోపలే అనుకుంది బయటకు మాత్రం సర్దుకొని

"ఊరికే అలా అన్నావుగాని, ఈడొచ్చిన చెల్లెల్ని నువ్వు స్టేషన్‌కు దిగబెట్టమంటావా ?" అని సర్దిపుచ్చింది.

మొత్తానికి రాజు జనార్ధనం గురించి జయమ్మగారి మనస్సును పూర్తిగా నింపేసి వెళ్ళిపోయాడు. వరద వెళిపోయినా అది వదలిన వెలితి పోలేదన్నట్లు పద్మావతి "డీలా"గా క్లాసుకి వెళ్తానని—లైబ్రరీకి వెళ్ళింది ! "ఎక్కడికివెళ్ళే మాత్రం ఏం ప్రయోజనం!" (ఇంకా ఉంది)



"రేపు మా పరీక్షల్లో వచ్చే ప్రశ్నలు చెప్పండి చూద్దాం?..."

# ఒకనాటి చిలిపిపని

21 వ పేజీ తరువాయి

ఆ పిల్ల రాక్షసి అయి ఉండాలి. ఆ పిల్ల ఇప్పుడీ సమయంలో నా కళ్లముందు కనిపిస్తే గొంతుక పిసికి పారేద్దును, నా మిత్రుడ్ని మోసం చేసినందుకు వాడ్ని స్థితికి తెచ్చినందుకు.

''—మనం చదువుకుంటున్న రోజుల్లో మాలతి అని ఒక అమ్మాయిని గురించి చెప్తుతుండే వాణ్ణి గుర్తుందా? మే మిద్దరం చిన్నప్పట్నుంచి కలసి చదువుకున్నామని, ఒకరి నొకరం ప్రేమించుకున్నామని, పెద్ద లంగీకరించినా అంగీకరించకపోయినా పెళ్ళి చేసుకుంటామని నిశ్చయించుకున్నామని చెప్తుతుండేవాణ్ణి. అప్పుడప్పుడు ఆ అమ్మాయి రాసిన ఉత్తరాలను నీకు చదివి వినిపిస్తుండేవాణ్ణి కూడ... మనం ఫోర్తియర్ చదువుతున్నప్పుడు మాలతి వాళ్ళ పెద్దవాళ్ళు పెళ్ళి చెయ్యటానికి నిశ్చయించారు. మాలతి మా ప్రేమ సంగతి చెప్పింది. ఎందుకనో వాళ్ల పెద్దవాళ్ళు ఒప్పుకోలేదు. వేరే సమ్మంధం నిశ్చయించారు. ఈ సంగతి నాకు ఉత్తరం రాసింది. మీ పెద్దవాళ్ల నెదిరించి నాతో వచ్చేయగల ధైర్యముంటే ఉత్తరంరాయి, నేను వచ్చి నిన్ను తీసుకుని వెళ్తాను అని నేను ఉత్తరం రాశాను. దానికి పెద్దలు సంఘం, పరువు, ప్రతిష్ఠ అని ఏమేమో రాసింది. నాకు కోపం వచ్చింది. అంత ధైర్యం లేనిది ప్రేమించటం దేనికి? కుటుంబ పరువు ప్రతిష్ఠలని—మన ప్రేమను, మన భవిష్యత్తును, మన మధుర స్వప్నాలను బలి చేసుకుంటావా! వారం రోజులు గడువు పెట్టుతున్నాను. ఈ వారం లోపల బాగా ఆలోచించుకుని ఏ విషయమూ ఉత్తరం వ్రాయి. గడువు లోపల నీ దగ్గర్నుండి జవాబు రాకపోతే, ఇక నీకూ నాకూ ఇంతే అని ఉత్తరం రాశాను—'

మధు ఆయాసంతో ఆవేశంగా చెప్పుకుపోతున్నాడు. ఇంతలో, రైలు వచ్చి ఆగింది. మధు ఎక్కి కూర్చున్నాడు.

'—గడువుదాటి వారం దాటినా మాలతి దగ్గర్నుండి జవాబు రాలేదు. అంటే, అయినవాళ్ళను కాదని నాతో రావటాని కంగీకరించలేదన్నమాట. ప్రేమను నేను తీసికున్నంత లోతుగా తీసుకోలేదన్నమాట. మాలతిని గురించి, మా ప్రేమను గురించి ఎన్నెన్నో వూహించుకున్న నాకు తగిలిన ఎదురుదెబ్బ ఇది......నాలో తీరని అశాంతి రేగింది. జీవితంమీద విరక్తి కలిగింది. బ్యాంకులోవున్న రెండువేల రూపాయిలు తీసుకుని దేశాలమీద పడ్డాను..... నన్ను మోసం చేసిన మాలతిమీద కసికొద్దీ త్రాగుడు, వ్యభిచారం ప్రారంభించాను. నా పతనంలో మాలతి అపజయాన్ని వూహించుకుంటూ ఆనందించాను......ఇలా పాడైపోయాను. ఈ స్థితికి వచ్చాను.'

నా చేతిలో వున్న మధు చేతిని లాక్కుని రైలు ముందుకు సాగింది. చూపు దాటిపోయింది. బరువుగా వెనక్కి తిరిగాను. నా నీడ నా ముందుకు వచ్చి నిలబడింది. రెండడుగులు వేశాను. నానీడ రెండడుగులు వేసింది. నానీడ నాముందు నడుస్తుంది. నా ఆలోచనలు వెనక్కి సాగుతున్నాయి. తారు ప్రగుమ్మరించినట్లు నా నీడ.......మసక మసకగా పది సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలు......

......ఆరోజు రూంలో నే నొక్కడ్నే ఉన్నాను. మధు, మిగిలిన ఫ్రండ్సు కలసి మ్యాట్నీ సినిమాకి

వెళ్ళారు. మా వూరెళ్ళే ప్రయాణంలో నేను వాళ్ళతోపాటు వెళ్ళలేదు. ఇంతలో పోస్టు వచ్చింది. మధుపేర ఒక కవరు వచ్చింది. అది వాడి ప్రేయసి మాలతి దగ్గర్నుండి వచ్చింది. మాలతి దగ్గర్నుండి ఉత్తరం వస్తే దాన్ని దాచేసి, వాడ్ని ఏడిపించి, వాడి దగ్గర పార్టీ తీసుకుగాని ఇచ్చేవాడ్ని కాదు. ఇప్పుడీ కవరు అలమరలో పడేస్తే వాడు తీసుకుంటాడు. మా వూరెళ్ళుతున్నాను కాబట్టి నాకు పార్టీ ఉండదు. నేను ఎలాగూ రెండు రోజుల్లో తిరిగి వస్తాను కాబట్టి ఉత్తరాన్ని నా వెంట తీసికెళ్ళి వూరునుండి వచ్చిన తర్వాత మధును ఏడిపించి ఇచ్చి పార్టీ తీసుకోవాలి. ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని మధు వాళ్ళు సినిమానుండి తిరిగి రాక ముందే మా వూరెళ్ళిపోయాను. దురదృష్టంకొద్దీ మా ఊరెళ్ళగానే నాకు జ్వరం వచ్చింది. పది రోజులు లంఖణాలు చేశాను. ఆ పది రోజులు ఆ ఉత్తరం సంగతే మర్చిపోయాను. నేను పథ్యం తీసికొని తిరిగి టవును వెళ్ళేసరికి పదిహేను రోజులు దాటింది. నేను వెళ్ళేసరికి, మధు ఊరొదిలి పోయాడని మా ఫ్రెండ్సు చెప్పారు. వాడికోసం తిరగటం, పేపర్లో ప్రకటనలు వేయించటం, వాడి వాళ్ళకు ఉత్తరాలు రాయటం—ఈ హడావుడిలో ఒక నెల తర్వాత గాని ఆ ఉత్తరం గుర్తుకు రాలేదు. గుర్తుకు వచ్చిన తర్వాత ఆ ఉత్తరంలో ఏమి ఉందోనని చింపి చదివాను. మాలతి రాసింది. రెండే వాక్యా 'నీవు రాసిన దానికి నా కంగీకారమే! నీవు ఎప్పుడొచ్చినా సరే!......' అప్పట్లో ఆ వాక్యాలను నే పట్టించుకోలేదు. ఏమిటోలే అని వూరుకున్నాను.

ఇప్పుడు మధు చెప్పిన కథ విన్న తర్వాత వాడి దీన స్థితి కళ్ళారా చూచిన తర్వాత ఆ రెండు వాక్యాలల్లో ఎంత అర్థముందో అర్థమయింది. ఆ రెండు వాక్యాలున్న ఆ ఉత్తరం మా వాడి భవిష్యత్తును నిర్ణయించేటంత శక్తివంతమయినది. కాని, ఆ ఉత్తరం వాడి చేతుల్లో పడలేదు. పండంటి జీవితాన్ని చేతులారా పాడుచేసుకున్నాడు. దీని కంతటికీ కారణం నేను—నేను, సరదాకు చేసిన ఒక పిచ్చి పని ఇంత చేసింది. మిత్రుడి జీవితాన్ని నాశనం చేసిన నీచుడ్ని. నా పాపానికి నిష్కృతి ఏమిటి? నా ఈ నేరానికి శిక్ష ఏమిటి? ఎంతటి కఠిన శిక్షను అనుభవించినా నా పాపం ఇంకా మిగిలి పోతుంది......

నేను ఎక్కవల్సిన బండి వస్తున్నట్టుగా స్టేషను గంట గణగణ మ్రోగింది.

* * *

'నేను మధుగారి దగ్గర్నుండి వస్తున్నాను. ఆయన మీకీ ఉత్తరాన్ని ఇవ్వమన్నారు' అని ఆ వచ్చిన పెద్దమనిషి ఒక ఉత్తరాన్ని అందించగానే పైన జరిగిన కథ అంతా నా కళ్ళముందు కట్టినట్లు మెదిలింది.

'అలా కూర్చోండి. అన్నట్లు మీ పేరేమన్నారు.'

'నన్ను రాజశేఖరం అంటారండి' అని ఆయన నేను చూపించిన కుర్చీలో కూర్చున్నారు.

మా మధు రాసిన ఉత్తరం చదవటం మొదలు పెట్టాను.

'నీవు ఈ శానిటోరియంకు రాసిన ఉత్తరం అందింది. రాము! ఇందులో నీవు చేసిన పాపం ఏమీ లేదు. నీవు నాకేదో ద్రోహం చేశానని బాధ పడాల్సిన అవసరం అంతకంటే లేదు. నాకిలా జరగాలని రాసి పెట్టి ఉంది. అది నీ ద్వారా జరిగింది. నీవు కాకపోతే మరింకెవరి ద్వారానో జరిగి ఉండేది. నీ ద్వారా ఇలా జరగటంవల్ల నా కొక పెద్ద మేలు జరిగినట్లే! మిత్రుడవు కాబట్టి సహృదయంతో జరిగిన విషయాన్ని రాశావు. అదే నీవు నాకు చేసిన మేలు. నా కదే పదివేలు. ఈ ఆఖరి దశలో నీ ఉత్తరం నా కెంతో బలాన్ని, మనఃశాంతిని చేకూర్చింది. నా అపోహ తొలగిపోయింది. మాలతి నన్ను హృదయ పూర్వకంగా, నిర్మలంగా ప్రేమించిందన్న తృప్తి నా [illegible]గిలిం[illegible]. అది చాలు నాకు!

నిజంగా[illegible] మాలతి కూడ నన్ను లోతుగా ప్రేమించింది. అందుకనే దాంపత్య జీవితంలో సుఖపడలేక పోయింది. నన్ను మరవలేకపోయింది. తన ప్రేమ విఫలమై పోయేసరికి జీవితంమీద, ఈ లోకంమీద విపరీతమైన ద్వేషాన్ని పెంచుకుంది. అందరిమీద పగ తీర్చుకోవాలి, జీవితంలో ఏదో ఒక వెంచర్ చెయ్యాలి. ఏం చెయ్యగలదు. తన చేతుల్లో ఏముంది? తన చేతుల్లో ఉన్నదల్లా తన సంసారం. తన కసిని, ద్వేషాన్ని తన భర్తమీద, తన సంసారంమీద తీర్చుకుంది. కావాలని తన సంసారాన్ని నరకం చేసుకుంది. రెండు సంవత్సరాలక్రితం ఒకానొక ఉద్రిక్త పరిస్థితిలో, నరాల బలహీనతవల్ల తన్ను తాను కంట్రోల్ చేసుకోలేక కిరసనాయిల్ పోసుకుని వళ్ళు కాల్చుకుని చనిపోయింది......తనను ఎంతో గొప్పగా ప్రేమించిన భర్త జీవితంలో మంటలు రేపింది. ఫలితం అతని క్కూడ టి. బి. ఎటాక్ అయింది. ఇప్పుడు ఈ శానిటోరియమ్‌లోనే ఉన్నాడు. నా ప్రక్క బెడ్డు అతనిది. అతని ద్వారానే ఈ సంగతులన్నీ తెలిశాయి.....ఎవరేం జేస్తారు? ఎవరికి ఎలా జరగాలని రాసి పెట్టి ఉంటుందో అలా జరగవల్సిందే! విధి విధానాన్ని ఎవరు తప్పించగలరు? దీంట్లో నీవు కావాలని మాకు చేసిన ద్రోహం ఏమీ లేదు. విధి చేతుల్లో నీవు ఒక సాధనానివి మాత్రమే!

నీవు బాధ పడవల్సింది. నేను నిన్ను మన్నించాల్సిందేమి లేదని మళ్ళీ ఇంకొకసారి చెప్పుతున్నా.

ఇక ఉంటాను,

నీ మధు.'

మధు నన్ను మన్నించాడు. నా మధు సంగతి నాకు తెలుసు. వాడిది గొప్ప హృదయం. ఎంత మంచివాడు కాకపోతే, నే నింత చేసినా నా తప్పేమీ లేదంటాడా? అంత మంచివాడి జబ్బు తప్పకుండా తగ్గిపోతుంది. భగవంతుడు దయామయుడు. మా వాడ్ని మళ్ళీ ఈ మనుషుల్లో పడేస్తాడు. ఒకసారి మదనపల్లి వెళ్ళి వాడ్ని చూచి రావాలి.

తృప్తిగా నిట్టూర్చి ఉత్తరాన్ని మడిచిపెట్టుతూ రాజశేఖరంగారి వంక చూచి 'మా మధు ఎలా ఉన్నాడండి? కులాసాగా ఉన్నాడా?' అని అడిగాను.

ఆయన చేతి గోళ్ళవంక చూసుకుంటూ, 'ఆయన చనిపోయి వారం దాటిందండి' అన్నాడు!

రాజశేఖరంగారిని సాగనంపటానికి గేటుదాకా వెంట వెళ్ళాను. 'ఉంటానండి మాస్టారు. మీరివిషయంలో అనవసరంగా బాధ పడకండి—' నా భుజం మీద చేయివేసి అన్నాడాయన.

నేను చేసిన అవివేకపు పనికి బాధపడకుండా ఎలా ఉండగలను?

గేటుతెరచాను. రెండడుగుల ముందువేశాడాయన.

'అన్నట్టు మా మధు మీ కెలా తెలుసు? మీరు కాలేజి స్నేహితులవుతారా?' అని అడిగాను.

'నేను మాలతి భర్తనండి!' అని, వెనక్కి తిరిగి చూడకుండా గబగబ నడుచుకుంటూ వెళ్ళిపోయాడాయన. ★

# మనమూ - మన దేహస్థితి

19 వ పేజీ తరువాయి

పదార్థములవల్ల నాభి పైనా, ఈసాఫెగస్ పొడుగునా మంట ఏర్పడుతుంది. పుల్లత్రేన్పులొస్తవి. అవి వాసనతో కూడుకున్నవిగా ఉంటవి.

ఆహారం ప్రేగుల్లోకి పోనందున, శరీరధాతువులు శుష్కించిపోతవి. రోగికి ఆకలి క్రమంగా తగ్గిపోతుంది. కాని, దాహం అధికంగా ఉంటుంది. మూత్రం పరిమాణం తగ్గిపోతుంది. మలబద్ధకం అంతకంతకు అధికమైపోతుంది.

పైలోరిక్ ద్వారంలో ఆటంకం బహుకాలంగా ఉన్నప్పుడు వాంతి ద్వారా, లవణ లోపం ఏర్పడి శరీరాంగములు బిగుసుకుపోతవి. అంగ సంచలనం (Convulsions) ఏర్పడుతుంది. రక్తక్షీణత, విటమినులు లేక ఏర్పడే వ్యాధులూ సంభవిస్తవి.

పైలోరస్ ద్వారంలో ఆటంకం ఏర్పడే పరిస్థితులు ఏర్పడకుండా చూసుకోవాలే గాని ఒకమారు అది ఏర్పడ్డ తరువాత శస్త్రవైద్యమే శరణ్యం. ఆ శస్త్రవైద్యమైన జఠరాశయం పొగకముందు కేన్సరు ఏర్పడకముందు, ఆహారలోపంవల్ల శరీర ధాతువులలో జీర్ణ ప్రక్రియలు (Degenerative Process) ఏర్పడకముందు జరిగితేనే ప్రయోజనం ఉంటుంది. కొంతమంది శిశువులు పైలోరస్‌లో ఆటంకంతోనే పుడతారు. వారికి పాలు పట్టగానే కక్కేస్తారు. ఆ వాంతి చిమ్మి కొట్టినట్లుగా దూరంగా పడుతుంది. ఇది పైలోరిక్ స్ఫింక్టరు దుస్సంకోచంవల్ల ఏర్పడితే కొంతసేపటికి తగ్గిపోతుంది. రెండు, మూడుసార్లు అలా జరిగితే ఏమాత్రమూ తాత్సారం చేయకుండా శస్త్రవైద్యుణ్ణి సంప్రదించడం అత్యవసరము. అతను శస్త్రచికిత్స అవసరమని భావిస్తే వెంటనే చేయించడం అవసరమే ! ఆలస్యం జరిగినకొద్దీ అపాయం జరుగుతుంది.

పెద్దవారిలో ఇది హఠాత్తుగా ఏర్పడదు. పెద్దవారిలో ఇది ఇతర వ్యాధులకు ఏర్పడే పరిణామంగానే ఏర్పడుతుంది. పైన వివరించిన లక్షణములు ఏర్పడగానే వైద్యుణ్ణి సంప్రదించి, తగిన ఆహారము, ఔషధము తీసుకుంటే శస్త్రచికిత్స లేకుండానే వ్యాధి నివారణ కావచ్చు. కాకపోతే శస్త్రచికిత్సే శరణ్యం. శస్త్రచికిత్సకైన శరీరంలో దారుఢ్యం ఉండాలి. వ్యాధిని నిర్లక్ష్యం చేసినకొద్దీ యీ దారుఢ్యం తగ్గుతుంది. శరీరంలో నిర్బల స్థితి వాంతి అధికమైపోతవి. రక్తంలో యూరియా పేరుకుపోతుంది. కిడ్నీలు చెడి నెత్తురుపోటు హెచ్చుతుంది. ఇవన్నీ శస్త్రచికిత్సకు ఆటంకములౌతవి. శస్త్రవైద్యుడు అఘాయిత్యంగా ఆపరేషన్ చేయడానికి జంకుతాడు. బాధపడి బాధపడి అందరూ గుడ్లు మిటకరించుకుని చూస్తూ మనశ్శాంతి కోసం చేసే మామూలు ప్రయత్నాలు చేస్తుంటే చివరకు దుర్మరణం దృఢమైపోతుంది. వెంటనే తెలుసుకుని అతి శీఘ్రంగా శస్త్రచికిత్స చేయవలసిన వ్యాధుల్లో పైలోరస్‌లో ఆటంకం ఒకటి. ★

ధరలు కూడా సరసమైన స్థాయిలలోనే ఉన్నాయి. కాని ఆఖరికి ఈ కొద్దిపాటి రక్షణ వల్లకూడా సంపద కేంద్రీకరణం కొద్ది కొద్దిమంది వ్యక్తుల చేతులలోకి పోవటం ప్రారంభమైంది.

మన రాజధాని నగరంగా రూపొందకముందు ఢిల్లీ నగరం ఎలా ఉండేదో తెలుసా ? ఒక లక్ష రూపాయలుంటే చాలు లక్షాధికారి అనేవాళ్ళు. అలాంటి లక్షాధికార్లు వందలకొద్దీ ఆ నగరంలో ఉండేవారు. ఈ జనాభా అంతా మాసిపోయి నగరమంతా కొద్దిమంది కోటీశ్వరులు, ఇప్పుడు అంతులేని భిక్షాధికార్ల మయమైపోయింది. పన్ను విధింపువల్ల ఆర్థిక సమాన తను సాధించవచ్చని కాంగ్రెస్ అనుకుని ఉండొచ్చు. అసలు విషయ మేమిటంటే కొత్తపన్ను పడినప్పుడల్లా న్యాయ వాదులకు పని ఎక్కువవుతుంటుంది. పన్నులు ఎలా తప్పించుకోవాలో సలహాలిస్తూ ఉంటారు. స్వర్గీయ సర్ కోవార్జీ జహంగీర్ అనే ఓ కోటీశ్వరు డొకప్పుడు పార్లమెంటులో ప్రసంగిస్తూ దేశంలో ప్రతి ఒక్కడూ చెల్లించాల్సిన పన్ను చెల్లిస్తే కొత్త పన్నుల అవసరమే అంతగా లేదన్నారు.

అసలు సంపత్సమానత్వాన్ని సాధించేముందు అవకాశ మానవత్వాన్ని సాధిస్తే చాలా మంచిది. కొంతమంది మంత్రులకున్న అతి దూరపు బంధువులకు ప్రాధాన్యం ఇచ్చిన సందర్భాలు కూడా నే నెరుగుదును.

* * *

ప్రణాళికా సంఘం కొత్త సభ్యుడు డా. వి. కె. ఆర్. వి. రావు అభివృద్ధి ప్రణాళికలతో కార్మికుల శక్తి కలిపి సంఘటితం చేసే పథకం రూపొందించ ప్రయత్నిస్తున్నారు. ఇప్పటి అంచనాల ప్రకారం 1976 నాటికి శ్రామికులసంఖ్య 7 లక్షలు అవుతుంది. ఇందులో మూడవ ప్రణాళిక పూర్తి అయ్యే సంఖ్య, ఉద్యోగులు, పరోక్షంగా అంటె చిల్లర చిల్లర పనులుచేసే వారు చేరరు. చిల్లర ఉద్యోగాలు చేసేవాళ్ళ సంఖ్య అత్యధికం, వీళ్లలో చాలామంది అనేక రాజకీయ కారణాలవల్ల భారత ప్రభుత్వ సచివాలయంలో ఉద్యోగాలు సంపాదించుకున్నారు. అసలు సచివాలయంనిండా ఇలాంటి వాళ్ళ ఎక్కువ. ఇప్పటి టూకీ అంచనాల ప్రకారం 1976లోగా కనీసం 5 లక్షల ఉద్యోగాలు కొత్తగా కల్పించబడాల్సి ఉన్నాయట. చర్చలలో ఉన్న పథకాలు, రాష్ట్రాల వారీ పద్ధతిలో పథకాలకూ ఉద్యోగాలకూ ఒక సంబంధాన్ని ఏర్పరుస్తాయి. అంటే ఉద్యోగాలు చూసే బాధర బందీ కేంద్రమే కాకుండా రాష్ట్రాలు కూడా పంచుకుంటాయన్న మాట.

ఇంకో రూపంగా చెప్పాలంటే భారత ఫెడరల్ రాజ్యాంగం ప్రకారం ఉద్యోగాలు చూపించే బాధ్యత రాష్ట్రాలదేనని సంఘసేవా సంస్థలు మంత్రులకు డా. రావు చెప్పాలని పథకాన్ని రూపొందిస్తున్నారన్నమాట. 1921 నుంచి రాజ్యాంగ పరిస్థితి ఇలానే ఉంది. అసలిదొక రకపు మంత్రి వర్గపు సామ్రాజ్యవాదం. మొదటి పంచవర్ష ప్రణాళిక చివరి రోజుల్లో కేంద్ర ప్రభుత్వం ప్రాథమిక విద్యతో సహా అన్నీ ఖుక్కుం చేసు

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

కోటంతో ఇది ప్రారంభమైంది. మొన్నటి పార్లమెంటు సమావేశంలో పబ్లిక్ అక్కవుంట్ల సంఘం అధ్యక్షుడు శ్రీ మహవీర్ త్యాగి ఈ ప్రసక్తి తీసుకు వచ్చారు కూడా. దీనికి వివరణగా విద్యా మంత్రి ప్రొఫెసర్ హుమాయూన్‌కబీర్ స్వాతంత్ర్యం రాకపూర్వం భారతదేశంలో విద్యా ప్రమాణాలు పాటించ బడలేదనే ఉద్దేశ్యంతో కేంద్రమే, కొద్దిపాటి ధనం గుప్పించి రాష్ట్రాలు చేసే పనిని స్వీకరించిందని, రాజ్యాంగ విరుద్ధమైన చర్యను సమర్ధించారు.

ఈ 'సదాచారం' ఒక ప్రక్కన రాష్ట్రాలు ప్రతిదానికీ ఆఖరికి తమ బడ్జటు మార్గాలకు ధనం సంపాదించేందుకు కూడా కేంద్రం మీద ఆధారపడేట్లు చేసింది. ఇంకో ప్రక్కన, రాష్ట్రాలు ధనం మదుపుపెట్టి సాగించాల్సిన ప్రాజక్టులను ఇంకా ఇంకా పన్నులువేసి పెట్టుబడి పెట్టి ఇతోధికంగా కొనసాగించాలని కేంద్రానికి పూతం ఇచ్చేది కూడా ఈ సదాచారమే. అంతేకాదు! ఈ పద్ధతి ప్రజాభిప్రాయం అనే ఒకే ఒక్క అవకాశాన్ని కూడా దేశానికి లేకుండా చేస్తున్నది. కారణం ఏమంటే, కేంద్రం పరోక్షంగా విధించే పన్నులమీద ప్రజాభిప్రాయం బయటికి రావటం సాధ్యంకాదు. అసలు కేంద్రం ఎక్కువగా ఆధార పడేది ఈ పన్నులమీదనే. ప్రత్యక్షపన్నులాగా దాపరించిన నిర్బంధ పొదుపు పథకం మీద ప్రజాభిప్రాయం ఇట్టే తెలిసిపోయిందిగదా !

* * *

1971 నాటికి సుమారు రెండులక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి లక్ష్యాన్ని చేరుకునే విషయం ఆలోచనలో ఉంది. అయితే డా. లోకనాథన్ సంఘం మాత్రం అప్పటికి ఉత్పత్తి లక్ష్యం 180000 టన్నులు అని మాత్రమే పేర్కొంది. డా. లోకనాథన్ సంఘం సర్ జహంగీర్ గాంధీ అభిప్రాయాలను పేర్కొంటూ 180000 టన్నులకు సుమారు 450000 టన్నుల 'కోక్' బొగ్గు 280 — 300 టన్నుల ముడి ఇనుము, 90000 టన్నుల సున్నపురాయి కావాలని తెల్పింది. ఇది సాధించాలంటే మందీ మార్బలం రవాణాలాంటి సమస్యలు ఎదురవుతాయి. 1971లో 20,0000 టన్నుల ఉత్పత్తి లక్ష్యాన్ని చేరుకొనే పద్ధతి మీద ఒక పథకాన్ని రూపొందించేందుకు ఒక సంఘాన్ని కూడా నియమించటం జరిగింది. 1966 ఉత్పత్తి లక్ష్యం 90000 టన్నులు మాత్రమే.

ఇదిలా ఉండగా అమెరికా సహాయం లేకుండా పని ప్రారంభించే ప్రయత్నాలను బొకారోలో తీవ్రతరం చేశారు. పార మెంటులో ఉక్కు శాఖ మంత్రి వెల్లడించిన విధంగా ప్రభుత్వం ఈ ప్రాజెక్టు క్రింద భారతదేశంలో తయారయ్యే వస్తు సముదాయాన్ని పూర్తిగా వినియోగించాలి.

ఇంకా కావలసిన ముఖ్యమైన భాగాలేవైనా ఉంటే వాటిని ప్రపంచ విస్తృతంగా వచ్చిన టెండర్లనుంచి, అందులోను ఋణాలు సంపాదించుకో గల దేశాల టెండర్లద్వారా తెప్పించుకోవచ్చును. ప్రపంచంలో అమెరికా, బ్రిటన్, రష్యా, ఫ్రాన్స్, బెల్జియం, ఆస్ట్రియా, జపాన్ దేశాలు మాత్రమే ఉక్కు తయారు చేస్తున్నాయి.

నాల్గవ ప్రణాళికా కాలంలో ప్రభుత్వ రంగంలోని మూడు ఉక్కుమిల్లులు విస్తృతం చేయటం జరుగుతుంది. రష్యా, అమెరికా, బ్రిటన్ దేశాలనుంచి తగిన సహాయం లభిస్తుందని ప్రభుత్వం అనుకుంటున్నట్లుంది, కానీ అనుమానమే. ఏమంటే రూర్కెలా ఉక్కు కార్మాగార విస్తృతితో బాటు ఇంకా అదనపు సహాయాన్ని జర్మనీ ఇవ్వగలదా అనేది అనుమానం; ఫ్రాన్స్, బెల్జియం, ఆస్ట్రియా, జపాన్‌లు సుమారు ఐదుపందల కోట్ల రూపాయల విలువగల పెద్ద పథకాలకు సహాయం చెయ్యగల స్థితిలోలేవు కారణ మేమంటే వాళ్ళిచ్చే సహాయం ఎంత భారీగా



## ముంగర శంకరరాజు

శ్రీ శంకరరాజు హిందీ తెనుగు భాషలలో మంచి వక్త. చిత్తూరు మల్టీపర్పస్‌స్కూలులో హిందీ సీనియర్ పండిట్ గా వుంటున్నారు. సుమారు 40 సం॥ల వయస్సుగల వీరి యితర రచనలు రహీం కూతురు (కథలు) విపథగ (నవల) మున్నగునవి వున్నాయి. వీరు తులసీ రామాయణంమీద చాలా చోట్ల ప్రసంగాలను కూడా చేశారు. జన్మస్థలం కడప జిల్లాలోని నంబేపల్లె గ్రామం.

ఉన్నప్పటికి, ఈ సహాయం అప్పుగా తీసుకుని అన్ని హంగులతో బొకారోను నిర్మించటం ఆర్థికంగా అసాధ్యమే అవుతుంది. అందరితోబాటు నూవ్వ్యా అనే పద్ధతిన సహాయం చేయటానికి రష్యా ససేమిరా అంగీకరించదు. ఆదేశం భారత దేశంలో విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నందు వల్ల, వూరుపేరులేన్నట్లు ఉమ్మడిలో చేర్చటానికి ఒప్పుకోదు. రష్యా మహాచేస్తే, ఈ బొకారో ఉక్కు కార్మాగారానికి కావలసిన వాటిని అత్యధిక భాగం ఉత్పత్తి చేసేందుకు రాంచీలోనియంత్ర నిర్మాణ శాలలో ఉత్పత్తిని పెంచేందుకు ప్రయత్నిస్తుందేమో. వాణిజ్యం పద్ధతిమీద అమెరికా, బొకారోకు కొంతధనం ధనసహాయం చేస్తుందేమో కాని ఇంకో ప్రాజక్టులో ఈ లోటు కన్పిస్తుంది. బ్రిటన్ విషయంకూడా అంతే.

## న్యూఢిల్లీ లేఖ

కాని ఇక్కడకొన్ని సలహాలు కనిపిస్తున్నాయి. అమెరికా బ్రిటన్‌లతోపాటు ఈ బొకారో భారాన్ని స్వీకరించవలసిందిగా "యూరోపియన్ కోల్ అండ్ స్టీలు కమ్యూనిటీ"ని ప్రోత్సహించాలంటున్నారు. ఇలాంటి పెద్ద ప్రయత్నంవల్ల ప్రాజెక్టు పెద్ద కష్టం లేకుండానే పూర్తికావడం జరగవచ్చు. ఐరోపా సమిష్టి విపణిలోని భారత రాయబారి శ్రీ కె. బి. లాల్ చేసే ప్రయత్నం ఈ ప్రాజెక్టును చేపట్టించేందుకుగాను పై సంస్థ సహకారాన్ని సంపాదించగలదేమో !

ఈ కథింతటితో అయిపోలేదు. ఉక్కు శాఖ మంత్రి ఈ ప్రాజెక్టు విషయంలో సలహాదార్లుగా ఒక భారతీయ సంస్థను నియమించాలనుకొంటున్నట్లు తెలుస్తుంది. ఈ సంస్థ ఇంతవరకు ఏ ఉక్కు మిల్లునూ నిర్మించి ఉండక పోవటం వల్ల బాధ్యతంటే ఏమిటో తెలిసిన పలువురు పెద్దలలో అనుమానాలు కలుగుతున్నాయి. ఈ సంస్థకు సుమారు 600 కోట్ల రూపాయల విలువగల ప్రాజెక్టును అప్పగించటం అంత క్షేమకరమా ? అనే ప్రశ్నకు కలుగుతూంది. ఇదివరకు ఈ సంస్థ ఓ నివేదిక సమర్పించింది. ఇది 20000 టన్నుల ఉక్కు ఉత్పత్తి శాలను గూర్చి మాత్రమే. ఇప్పుడు 40000 టన్నుల ఉత్పత్తి శాలను గురించిన సమగ్ర నివేదిక పరిశీలనలో ఉంది. ఈ నివేదిక తయారు చేసింది. అమెరికా ఉక్కు సంస్థ (U. S. Steel Mission)



బిచ్చగాళ్ల నివాసం తారనాకాలో ఏర్పాటు చేశారు. ఇంకా కొన్నిచోట్ల ఇలాంటి మజిలీలు నిర్మించటానికి ఆలోచనలు జరుగుతున్నాయి. రాష్ట్రప్రభుత్వంవారు 75 వేల రూపాయలు మంజూరు కూడా చేశారట ! సముద్రంలో నీటిబొట్టు ! పోలీసువారు వీధులవెంబడి తిరిగి ఈ బిచ్చగాళ్లను తరిమి తరిమి పట్టుకొచ్చి బిచ్చగాళ్లకు నియమింపబడిన కట్టడాల్లోకి పంపుతారు. అక్కడ వీళ్లను పోషించటం, పనంటూ ఉంటే చేయించడం ! ఇదొక సమస్య మళ్లీ ! ఇదంతా, తెచ్చిన చట్టాన్ని అమలు చెయ్యాలనే తాపత్రయంతో జరుగుతున్న పని. అంటురోగుల్ని వీధులవెంబడి తిరగకుండా చెయ్యటం ప్రప్రథమంగా చూడాలసిన పని. అక్టోబరు 1 వ తేదీకే ఈ చట్టం అమలులోకి వచ్చినా ప్రజలకు మాత్రం, బిచ్చగాళ్లను నిషేధిస్తూ ఓ చట్టాన్ని అమలులోకి తెచ్చారని చెప్పేదాకా తెలీకుండా ఉంది. మిగతా బాపతుకు తగిన పాటలు, పనులు కల్పించకపోతే, చేసేపనిని నిరోధిస్తూ ఉంటే వాళ్ల బుర్రల్లో ఆలోచనలు వెర్రితలలు వెయ్యటానికి అవకాశం లేకపోలేదు. ఏరూపంగా పరిణమిస్తాయో, ఏవిధంగా వీళ్లు విచ్చలవిడయిపోతారో వూహించుకుంటే యీ బిచ్చగాళ్ల బెడదకంటే, అవే భయంకరంగా కనిపిస్తాయి. ఈ సమస్యా పరిష్కారం కడు దుర్లభమైనదే ! అయినా పరిష్కారమార్గానికి అన్వేషణతోపాటు, చట్టం అమలులో లోపాలు లేకుండా చూసుకోవటమూ అవసరమే !

## విస్తృత హైదరాబాదు

జంట కవుల్లాగ, జంటా నగరాలు కూడా ప్రసిద్ధి చెందినవే ! హైదరాబాదు, సికిందరాబాదు నగరాల్ని ముచ్చటగా జంట నగరాలని పిలవటం పరిపాటయిపోయింది. వీటి రెంటి మధ్య మూసీ నది అడ్డంగా కనిపించినప్పటికీ, ఆ నది ప్రమేయం లేకుండానే రెండు నగరాల మధ్య సూటిగా దార్లు ఉండనే ఉన్నాయి. రెంటికీ వేరు వేరు పురపాలక సంఘాలు ఈమధ్య దాక ఉన్నాయి. అయితే ఇంకా సన్నిహిత సంబంధాలు నెలకొల్పటానికి పేరు వేరైనా, 'ఆత్మ' ఒకటే అనటానికేమో అన్నట్లు రెంటినీ కూడా ఒకే కార్పొరేషన్ క్రిందకు తీసుకువచ్చారు. విశాల హైదరాబాద్ అన్నారు. రోజురోజుకు వచ్చి పడుతున్న జనాభాతో పెరిగిపోతున్న చిన్న చిన్న, పెద్ద

## రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

పరిశ్రమలతో పట్నం ఇట్టే పెరిగిపోతూ వస్తోంది. మిగతా పరిశ్రమల మాట అటుంచితే ఇళ్ళు కట్టే పరిశ్రమ మాత్రం బాహాటంగా, భారీయెత్తున సాగిపోతోంది. అదివరకు ఎక్కడ చూసినా ఖాళీ స్థలాలే ! ఇప్పుడు ఎక్కడ చూద్దామన్నా ఖాళీ స్థలం కనిపించటంలేదు. ఇంతగా ఉన్నప్పటికి, పట్నం అభివృద్ధి శాఖవారు, విశాల హైద్రాబాద్‌ను విస్తృత హైదరాబాదుగా మార్చాలని సంకల్పించారు. రాష్ట్రప్రభుత్వంవారు కేంద్ర ప్రభుత్వం వారిని అడిగిన అప్పులో ఆరున్నర లక్షల రూపాయలు ఈ బృహత్ప్రణాళిక తయారుచేయటానికి వెచ్చించ నిశ్చయించారు. ఇప్పుడున్న 85 చదరపుమైళ్ల విశాల హైదరాబాదును చుట్టుపట్ల గ్రామాల్ని కలిపేసి 400 చదరపుమైళ్ల దాకా పెంచాలని ఆశ. అంటే రాజేంద్రనగర్ మేడ్‌చల్, పటం చెరువు, ఘటకేసర్, సరిహద్దుల్లో అన్నమాట ! ఇది ఎప్పటిమాటో ! కాని ఏభై ఏళ్లలో మాత్రం, 125 చదరపుమైళ్ల దాకా పెరిగిపోతుందని అంచనా ! దీనికోసం రెండు వందల కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని లెక్కలు వేశారు. మరి ఈ డబ్బు ఎట్లా సంపాదిస్తారో ! ఎవరు అప్పు యివ్వటానికి సిద్ధంగా ఉన్నారో చూడాలి ! ఇప్పుడవుతే అందరూను అప్పులు తీసుకోవటానికే సంసిద్ధులై ఉన్నారు.

అక్టోబరు రాంగానే, ప్రప్రథమంగా, దేశవ్యాప్తంగా, అందరికీ తెలిసేది, మహాత్మాగాంధీ జయంతి. ఆయన్ను చూసినవాళ్లు, చూడని వాళ్లూ గాంధీజీ సూక్తులు వల్లించటం, ఇతరులకు బోధ చేయటం ఆచార మయిపోయింది. రెండో తారీఖున సూత్రయజం, ఖద్దరు కట్టుకోవటం, ఢిల్లీలో ఉంటే, రాజ్‌ఘాట్ చుట్టూ తిరిగిరావటం, అలవాటయిపోయింది. సాంప్రదాయ సిద్ధంగా, మనవాళ్లు, కొన్ని ఆచారాల్ని ముక్కుకు సూటిగా వెళ్ళి, ఆచరించటం కూడా మనకు కొత్తకాదు. ఆ బాపతుకింద ఇది కూడా చేరిపోయింది. హైదరాబాదు మాత్రం తీసిపోయిందా ! గంభీరోపన్యాసాలు జరిగినాయి. గాంధీజీ చెప్పిన మాటలు వల్లె వేసుకున్నారు. చేతులు దులిపేసుకున్నారు. బాధ్యతలు తీరిపోయినాయి.

మనం ఏ విషయం ఆలోచిస్తున్నా గాంధీజీ ప్రవచించిన సూక్తి, మనకు ఆదర్శవంతంగా ఉండటానికి ఉపకరిస్తూనే ఉంటుంది. అయితే ఆయన ఏం చెప్పాడో. మనం తెలుసుకొనాలనే కుతూహలం లేదు ఓపికా అంతంత మాత్రమే! ఒక వేళ తెలుసుకున్నా, ఆచరించే స్తోమతాలేదు, శక్తిలేదు. ఈ మధ్య గాంధీజీని జ్ఞాపకం చేసే పని, ఉస్మానియా యూనివర్సిటి విద్యార్థులు చేశారు. విశ్వ విద్యాలయపు విద్యార్థులకు డిగ్రీలు ఇచ్చేముందర, ప్రతి విద్యార్థి గ్రామాదుల్లోకి వెళ్లి, నిరక్షరాస్యులకు విద్యాబోధన ఆరునెలల పాటు, చెయ్యాలనే నిబంధన ఉండాలని సూచన చేశారు. గ్రామాభివృద్ధికి గాంధీజీపడ్డ ఆవేదన అందరికీ తెలిసిందే ! ఈ విద్యార్థులు, సూచించిన సలహాను ఆచరణలో పెడితే, కొంతవరకు నిరక్షరాస్యత నిర్మూలమవటంలో సందేహంలేదు. గాంధీజీ పుట్టినరోజునాడు గత స్మృతులు ఎన్నో కలవరపెడుతూ వస్తాయి. ఆయన సత్యాగ్రహాలు, నిరాహార దీక్షలు, అప్పట్లో ఏమిటోగా కొంతమందికి కనిపించినా, తర్వాత వాటి మహత్తు అందరికీ తెలిసింది.

నిరాహారదీక్షంటే జ్ఞాపకం వచ్చింది. ఈ మధ్య రాజధాని నగరంలో, ఇలాంటి దీక్ష, కొత్త తొడుగులు తొడుక్కుని జనాన్ని వింతగా ఆకర్షించటం మొదలుపెట్టింది. కార్మికులు, గుమాస్తాలూ, వారి హక్కుల గుర్తింపుకోసం, నిరాహార దీక్ష పూనారు. బోలెడన్ని కార్మికులకు సంబంధించిన చట్టాలున్నాయి. వాటి విషయం యేమీ ఆలోచించకుండానే అంతకంటె తేలికనుకున్నారో యేమో ఈ నిరాహారదీక్ష, యజమాని ఫ్యాక్టరీ ముందరే సాగించారు. ఇంతకంటె విచిత్రమయింది. శాంతి నగర్‌లో ఇవ్వాలసిన బాకీని రాబట్టుకోవటానికి ఈ ఆయుధాన్ని ఉపయోగించాడు ఓ ప్రముఖుడు. నలుగురూ పోలీసులు పోవటం, రభస. కొంత మంది పెద్ద మనుషులు ఆయన దగ్గరకు వచ్చి మా నాయనే, మా తండ్రే, కాస్త మానేద్దూ అని బతిమాలటం. ఇదీ వరస.

—ఐ ఎల్. ఎన్. ★

కల్లోలం రేపమని నువ్వు ప్రోత్సహించావు. నీకోసం ఎన్నో హత్యలూ, దారుణాలూ చేశాను. నా దోపిడీ లలో భాగం పంచి ఇచ్చాను. నీకు తంత్రాలకు అడుగడుగునా అడ్డం తలుగుతున్న సేనాపతిని చంపమన్నావ్, చంపాను. అందుకు ఫలితంగా నాకు ఉరిశిక్షా ? ఆ ఉరిశిక్షను తప్పించుకొని ఇప్పుడు నిన్ను హతమార్చడానికి వచ్చాను."

"ఆవేశంలో ఉన్నావ్ భీమూ ! నన్ను హత మార్చి ప్రాణాలతో బయటపడగలవా నువ్వు ?"

"అది నా కత్తికి తెల్సు"

"నా ప్రాణాలు తీసినందువల్ల నీకు కలిగే లాభ మేముంది ?"

"ఆత్మసంతృప్తి"

"మూర్ఖుడా ! పొరబడుతున్నావ్. నన్ను చంపిన మరుక్షణం నువ్వు ఉరికంబం ఎక్కాల్సి వస్తుంది. చచ్చి సాధించేదేమిటి ? కనుక ఇద్దరం బ్రతికి ఉండి కావలసింది సాధిద్దాం. విను ! మహారాజు ప్రాణం తీస్తే నీపగ తీరుతుంది. మా కోరికా నెరవేరుతుంది. ఎల్లుండి మహారాజు గారి ఏకైక పుత్రిక జన్మదిన మహోత్సవం. అంతా సంతోష సంబరాలతోమునిగి ఉంటారు. ఆ రాత్రి..."

"సిద్ధమై వస్తాం" వెళ్లబోతూ బందిపోటు ఆగి

"ఆరోజు మళ్లీ మోసగించడానికి పూను కున్నావా ?" ఒరలో ఉన్న కత్తితీసి వంచి వదలి— "మంత్రీ !" అని హెచ్చరించి— వెళ్లిపోతాడు.

పై సంస్థవారు రెండు పాటలను కూడా గోల్డెన్ స్టూడియోలో రికార్డు చేశారు.

"వచ్చావులే— నచ్చావులే......
మా ఇంటికి వెలుగు తెచ్చావులే......"

ఈ పాటను కనకమేడల వ్రాశారు. సుశీల

# అవీ - ఇవీ - అన్నీ

11 వ పేజీ తరువాయి

పాడగా రికార్డు చేశారు. హేమలతో చిత్రీకరిస్తారు.

"అదే అదే వద్దంటా — పదే పదే చెబు తుంటా"
అందాల నాగుంటా— ఆశల్లా నా పంటా......

పై పాట సుందరాచారి వ్రాయగా మాధవపెద్ది పాడగా రికార్డు చేశారు. రేలంగితో చిత్రీకరిస్తారు.

ఈ చిత్రంలో రేలంగి, రాజనాల, బాలయ్య, మిక్కిలినేని, కృష్ణకుమారి, హేమలత, రాజారెడ్డి, చంద్రశేఖర్, వాలి సుబ్బారావు, ప్రసాద్ మొదలగు వారు నటిస్తున్నారు.

ఛాయ : హెచ్. ఎస్. వేణు (మంచిరోజులు వస్తాయ్ ఫేమ్) సంగీతం : బి. గోపాలం, నృత్యం : వేణుగోపాల్, కళ : సోమనాథ్, కూర్పు : హను మంతరావు, పాటలు : సుందరాచారి, కనకమేడల (ఇంతవరకు), స్టూడియో : వాహినీ, కథ—మాటలు : నిర్మాత : కనకమేడల వేంకటే శ్వరరావు, దర్శకత్వం : హనుమ్సారి కృష్ణమూర్తి.

## భద్రాచలంలో మూగమనసులు

ఇటీవల బాబూమూవీస్ వారి సాంకేతిక వర్గం భద్రాచలం, ఆ ప్రాంతమందలి సహజ సిద్ధమైన ప్రకృతిశోభతో కూడిన దృశ్యాలను మాత్రం చిత్రీ కరించుటకు బయలుదేరి వెళ్ళింది.

## భరణీ పిక్చర్సు

భరణీ పిక్చర్సువారు "పాత్ సాంకే బాంధా" అనే బెంగాలీ కథ మూలాధారంగా సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో కథానాయకీ నాయకులుగా భానుమతి, రామారావు, నటిస్తారు. కథానాయకుని పాత్ర ఈ చిత్రంలో క్రొత్త పంథాలో ఒక ప్రత్యేకత కలదని తెలుస్తుంది. ఇంకా నాగయ్య, కన్నాంబ, పద్మనాభం, వాసంతి, సూర్యకాంతం, మొదలగువారు నటిస్తున్నారు.



"గురువునుమించిన శిష్యుడు"లో కాంతారావ్.



రిపబ్లిక్ ప్రొడక్షన్సవారి "బొబ్బిలి యుద్ధం" లో విజయనగర ఆస్థాన నర్తకి (ఎల్. విజయలక్ష్మి) బుస్సీఎదుట నృత్య ప్రదర్శన.

# అవీ-ఇవీ-అన్నీ

రచన : పిచ్చేశ్వరరావు, పాటలు : సి. నారాయణరెడ్డి ఇంత వరకు రెండు పాటలు వ్రాశారు. దర్శకత్వం— రామకృష్ణ, విజయదశమి రోజున షూటింగ్ ప్రారంభిస్తారని తెలుస్తుంది.

## చక్రధారీ పిక్చర్స ప్రారంభోత్సవం

ఈ నెల 4వ, తేదీని వాహినీ స్టూడియో 6వ, ఫ్లోర్‌లో లాంఛనప్రాయంగా ఉదయం 8—30 గంటలకు ప్రారంభోత్సవం చేశారు. శాస్త్రయుక్తంగా మంత్ర, వేదపఠనాలతో ప్రారంభమైంది. వాహినీ, విజయాల అధినేత శ్రీ బి. నాగిరెడ్డి స్విచ్ ఆన్‌చేశారు. ఆ చిత్ర కథానాయకి కృష్ణకుమారి క్లేప్ కొట్టింది. పూజలో ఉన్న దేవునిపై ప్రథమ చిత్రీకరణ జరిగింది. శ్రీ యన్. టి. రామారావు ముఖ్యఅతిధిగా హాజరైనారు. శ్రీ రేలంగి, సి. యస్. ఆర్., పేకేటి గిరిజ, ఛాయాదేవి, జయంతి, పుష్పవల్లి, సూర్యప్రభ, నిర్మాతలు డి. ఎల్. నారాయణ, డూండీ, దర్శకులు మధుసూధనరావు, పి. సుబ్రహ్మణ్యం వగైరాలు, ప్రారంభోత్సవానికి చాలా మంది పాత్రికేయులుకూడా హాజరైనారు.

మూడురోజులపాటు సి. నారాయణరెడ్డి వ్రాసిన పాటను చిత్రీకరిస్తారు. పూజ అయిన తరువాత శ్రీమతి మీనాకుమారి పాడుతుండగా చిత్రీకరణ జరిగింది. "ఖావాళీ" పద్ధతిలో పోటీ పాటయిది. ఈ పాట చిత్రీకరణలో హీరో జగ్గయ్య కూడా పాల్గొంటారు.

ఈ చిత్రంలో జగ్గయ్య, కృష్ణకుమారి, మీనాకుమారి, బాలసరస్వతి, నాగయ్య, సి. యస్. ఆర్., రమణారెడ్డి, రాజనాల, పెరుమాళ్ళు, ఛాయాదేవి మొదలగువారు నటిస్తున్నట్లు నిర్మాత తెలియజేశారు.

కథ, డైలాగ్సు : శ్రీ కొవ్వలి, పాటలు : సి. నారాయణరెడ్డి, వేదాంతం రాఘవయ్య, (ఇంత వరకు)., సంగీతం : టి. వి. రాజు, ఛాయ : వరద రాజన్, కళ : కె. నాగేశ్వరరావు, నృత్యం : వసుమర్తి.

## రాముడూ-భీముడూ

సురేష్ ప్రొడక్షన్సువారు తమ సాంఘిక చిత్రానికి "రాముడూ— భీముడూ" అని నామకరణ చేశారు. ఈ చిత్రానికి కథ, మాటలు : డి. వి. నరసరాజు, పాటలు : సి. నారాయణరెడ్డి, (ఇంత వరకు వ్రాసింది.) సంగీతం : పెండ్యాల నాగేశ్వర రావు, కళ : రాజేంద్రకుమార్, దర్శకత్వం : తాపీ చాణక్య, నిర్మాత : డి. రామయ్య నాయుడు, అసోసియేట్ ప్రొడ్యూసర్ : జె. సుబ్బారావు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, రేలంగి రమణారెడ్డి, రాజనాల, జమున, శాంతకుమారి, సూర్యకాంతం, గిరిజ మొదలగువారిని నటీ నటులుగా బుక్ చేశారు. ఇంకా నటీనట వర్గం ఎన్నిక జరుగుతుంది.



తార జానకి.



నటి గీతాంజలి (ఫోటో: ప్రభాకర్)

## వివాహం

పూర్ణా పిక్చర్సు వ్యవస్థాపకులు శ్రీ జి. కె. మంగరాజుగారి మనుమడు చి. మంగరాజుకు, మద్రాసు వాస్తవ్యులు, వ్యాపారస్థులు శ్రీ బి. జ్వాలా నరసింహంగారి అమ్మాయినిచ్చి మద్రాసులోని ఆల్వార్‌పేటలో ఎతిరాజులు కళ్యాణ మండపంలో సెప్టెంబరు 29న మహా వైభవంగా వివాహము జరిపించేరు.

మగపెళ్లివారి తరఫున విశాఖ మినర్వా హాలులో 5వ తేదీన రిసిప్షన్ ఏ. ఎమ్. రాజా— జిక్కీల పాటకచేరీ జరిగింది.

## రాజ్యం పిక్చర్సు 'నర్తనశాల' రీరికార్డింగ్

రాజ్యం పిక్చర్సువారు నిర్మిస్తున్న మహాభారతంలోని రసవత్తరమైన ఘట్టంకు "నర్తనశాల" అని నామకరణం చేసి చిత్రం పూర్తి చేశారు.

సంగీత దర్శకుడు సుసర్ల దక్షిణామూర్తి భరణీ స్టూడియోలో తన ఆర్కెస్ట్రాతో వీనుల విందుగా రీరికార్డింగ్ ఇచ్చినట్లు తెలుస్తుంది.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, యస్. వి. రంగారావు, రేలంగి, సావిత్రి, సంధ్య., ఎల్. విజయలక్ష్మి, ముక్కామల కృష్ణమూర్తి, కాంతారావు (గెస్టుగా), నెల్లూరు వస్తాద్ కాంతారావు, ధూళిపాళ, ప్రభాకరరెడ్డి, శోభన్‌బాబు, సత్యనారాయణ, మల్లాది, వేమూరు రామయ్య, పొదిలి కృష్ణమూర్తి, వై. నారాయణస్వామి, వి. ఎన్. రాజు, కె. జి. రాజు, దండమూడి రాజగోపాల్, అల్లు రామలింగయ్య, (గెస్టులుగా), బాలకృష్ణ,

బొడ్డపాటి, సీతారాం, వంగర, రామకోటి మొదలగువారు నటించారు. కాంచనమాలను తిరిగి ఈ చిత్రంలో ప్రవేశ పెడుతున్నారు.

రచన : సముద్రాల రాఘవాచార్య, ఛాయ : ఎం. ఏ. రహిమాన్, సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి, కళ : టి. వి. యస్. శర్మ, నృత్యం : వెంపటి పెద్దసత్యం, కూర్పు : వీరప్ప, స్టూడియో : వాహినీ అండ్ భరణీ, దర్శకత్వం : కమలాకర కామేశ్వరరావు, నిర్మాతలు : శ్రీధరరావు, లక్ష్మీ రాజ్యం.

## "శ్రీ సింహాచలక్షేత్రమహిమ"

అందమైన కొండ ప్రాంతంలో గుడిసె. కోయ నిర్మాణంలా తెలిసిపోతున్నప్పటికీ దానిలో రాజసం మాత్రం ఉంది. చుట్టూ దూరాన చెట్లూ, నదులూ, కొండలూ, కనిపిస్తున్నాయి. వరికరాలు, వస్తువులూ ఆ సీమకు దొరగారి యిల్లని చెబుతున్నాయి. పరిస్థితుల ప్రాబల్యంవల్ల, ప్రేమించిన స్త్రీ కొరకు పురూరవ చక్రవర్తి రాజ్యాన్ని త్యజించి, వచ్చివేసినా చివరకు చేరిచేరి కోయదొరసీమకు ప్రభువు కాక తప్పింది కాదు. ప్రియుని కోసం స్వర్గమే వదలుకొచ్చి సాధారణ మానవ కన్యగా చివరకు కోయ కన్యగా కూడా రూపమెత్తి అతన్ని ఆకర్షించి, అతనికి భార్యగా వసంతగా అక్కడే దొరకు దొరసానిగా, అన్యోన్యంగా గడుపుతోంది శిరీష. సిరిసంపదలు, రాజ్య భోగాలు, విడిపోయినా, వాళ్ల అన్యోన్యతల్లో వారికి ప్రతి క్షణమూ స్వర్గమే.

మంచుతెర లప్పుడప్పుడే సూర్యకిరణాల తాకిడికి కరిగిపోతున్నాయి. పురూరవుడు మాత్రం ఇంకా నిద్రలోనే ఉన్నాడు. వసంత మాత్రం అప్పటికే లేచి శుచి అయి, భర్తవద్దకు వచ్చి పాదాలకు ప్రణామంచేసి, తలదగ్గర కొచ్చి అతని విమీలితనేత్రాల్లో నిండుదనాన్ని, ప్రశాంత వదనంలో చక్కదనాన్ని మనసారా దర్శించి, చెవి దగ్గరకు వంగి మెల్లగా మెత్తగా—

"ప్రభూ !"

పురూరవుడు మాత్రం మేలుకోలేదు. అది గమనించిన వసంత మరి కాస్త గొంతు స్థాయిని హెచ్చించి—అతని చేరువకు చేరి—

"ప్రభూ ! తెలతెలవారుతుంది. పవళింపు చాలించి మేలుకొండి." అతని చిరు కపోలాలను తన లేత చేతులతో స్పృశిస్తూ—

శీతల పవనాల స్పర్శకు వెచ్చని మేఘుడు విరిసి వర్షించేలాగ, పురూరవునిలో స్మృతి కలిగింది. కన్నులువిప్పి సరాసరి వసంత కళ్లల్లోనికి చూస్తాడు. వసంత రవంత బిడియంతో

"ఊ ! లేవండి."

"వసంతా ! పున్నమి జాబిలి నా కన్నుల కెదురుగా ఉంటే సూర్యోదయ మైందని అసత్య మాడతావేం ?"

వసంతలో గారం, అమాయకత ఒకదానిపై ఒకటి పందెం వేసుకున్నాయి. సిగ్గుతో ఆమె కనురెప్పలు రెపరెప లాడుతాయి. పరవశంలో నుండి ప్రస్తుతంలోకి స్మృతి తెచ్చుకుని—

"పగటిపూట జాబిల్లా ! ఎక్కడ !" అంటూ అటూ యిటూ వన్నెలల హొయలు ఒలికిస్తూ ఆమె కళ్ళు వెతుకుతాయి. ఆమె చల్లని మాటల్లో



పండిత
డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు-17

చక్కదనానికి మురిసిపోతూ వికసించిన విరిలాటి ఆమె వదనాన్ని తన అరచేతుల్లోకి తీసుకుంటూ—

"ఇదిగో యిక్కడ !" మోమువంక గోముగా, చిలిపిగా చూపిస్తూ, సిగ్గుపడే ఆమె కళ్లను చిటికెలో నవ్విస్తాడు. అతని పరిష్వంగంలో నుండి కాస్త జారుకోడానికి ప్రయత్నిస్తుంది వసంత. కాని, అతని ప్రేమ పూర్ణమైన కరాల సత్తువ ముందు ఆమె ప్రయత్నం వృధా అవుతుంది.

"పరిహాసాలు చాలుగాని యిక లేవండి" అని మాత్రం అనగలుగుతుంది వసంత అతని కళ్లలోనికి చూస్తూ.

పరిహాసం అవగానే పురూరవునిలో పాత కథ గిర్రున ఒక్కసారి తన బుర్రలో తిరుగుతుంది.

"అవును వసంతా ! నీకు నే చేసిన బాసలన్నీ పరిహాసాలే అయిపోయాయి."

"ఏమిటి మీరనేది."

"నగరానికి నిన్ను పట్టమహిషిగా చేస్తానని పట్నుడివికి తీసుకొచ్చాను కదూ !" అంటాడు పురూరవుడు. తన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేకపోయాననే చింతతో—వసంత కతనిలో ఆ అసంతృప్తి సహించరానిదై పోయింది. వెంటనే సంభాషణలో ఉన్న సారం గుర్తించి అతనికి సమాధానపరుస్తూ—

"ప్రభూ ! నగర మేమిటి ? .... నట్టడివేమిటి ? .... మీ సాన్నిధ్యంలో ఉంటే చాలు నా కదే స్వర్గం."

మాటల్లో వేయి వేణువుల మృదుస్వరం, ఆమె చూపుల్లో కోటి తారల మిలమిలలు అతని మనస్సును పులకింపజేస్తాయి. మరింత కౌగిలిలోకి లాక్కుంటూ—

"వసంతా !"

"ప్రభూ !" అతని అతని గుండెలపై వాలిపోతుంది.

క్షణకాలంపాటు ఆ రెండు మనసులూ మూగ మనసులై ఒకదానితో ఒకటి దాగుడుమూతలాడుతాయి. చూపుల పలుకుల్లో ఆ రెండు హృదయాలూ ఏకమై లోకమే మర్చిపోతారు. లోకంలో పరవశమంతా వారి స్వంతం చేసుకుంటారు.

ఈ సన్నివేశం శ్రీ సరస్వతీ మూవీస్ అండ్ శ్రీ వేంకటేశ్వర ఫిలింస్‌వారి "శ్రీ సింహాచల క్షేత్రమహిమ" చిత్రంలోనిది. పై సన్నివేశాలను ఈమధ్య వాహినీ స్టూడియోలో చిత్రీకరించారు.

పురూరవుడుగా కాంతారావు, వసంతగా కృష్ణకుమారి పాల్గొన్నారు. మాటలు, పాటలు : రాజశ్రీ, ఛాయ : మధు, సంగీతం : టి. వి. రాజు, కళ : బి. ఎన్ కృష్ణ, కథ : దర్శకత్వం—బి. వి. ప్రసాద్.

## "జగపతి పిక్చర్సు"

జగపతి పిక్చర్స్‌వారు తమ తాజా సాంఘిక చిత్రము "అగ్ని సంస్కార్" బెంగాలీ కథ ఆధారంగా తీస్తున్నారు. సెప్టెంబరు 17 నుండి ఊటీలో నాగేశ్వరరావు, బి. సరోజాదేవి, జగ్గయ్యలతో నెలాఖరు వరకు ఉండి మూడు పాటలను, కొన్ని సీనులను చిత్రీకరించారు.

ఇంకా ఈ చిత్రంలో రేలంగి, రమణారెడ్డి, నాగయ్య, చదలవాడ, కన్నాంబ, సూర్యకాంతం, గిరిజ, హేమలత మొదలగువారు నటిస్తున్నారు. గుమ్మడి గెస్టుగా నటిస్తున్నారు.

# అవీ - ఇవీ - అన్నీ

మాటలు, పాటలు : ఆత్రేయ, సంగీతం : కె. వి. మహదేవన్, ఛాయ : సి. నాగేశ్వరరావు, కళ : జి. వి. సుబ్బారావు, నృత్యం : హీరాలాల్, స్టూడియో : సారధి (హైదరాబాద్), నిర్మాత : రాజేంద్రప్రసాద్, దర్శకత్వం : వి. మధుసూధనరావు.

ఇంతవరకు ఆరు పాటలను రికార్డు చేశారు. పది రీళ్ల చిత్రం పూర్తి అయింది.

## "గుడి గంటలు"

రాజ్యలక్ష్మివారి "గుడి గంటలు" చిత్రం తమిళంలో హిట్ అయిన "ఆలయమణి" చిత్రం



"గురువుకుమించిన శిష్యుడు"లో రాజశ్రీ

# ఆడంబరాలను విడనాడండి
# దేశసంపదను వృథా కానీయకండి

Earn Rs. 300/00 or more P. M. in your spare or whole time by booking orders for a wide range of Tobacco, Pan-ka Masala, Perfumed HARI OM Tablets and other delicacies of all India Repute.

District-wise Agents are being appointed for unrepresented areas Write for terms and sample set.

**HARI OM & CO.,**
8/30, Arya Nagar, Kanpur.

## RATNAM'S N-OIL
(పై పూతకు మాత్రమే)

అంగవరవములు. బలహీనత చెంది, చిన్నదై సచో తిరిగి యథాప్రకారం అయిపూర్తి సౌఖ్యమనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10/-లు: వి. పి. 1-50. కావలసినవారు ఎడ్వాన్సు పంపేది ఇందులో స్పెషల్ రకం అర్జంటు గుణమునక రూ. 25-00 లు వి. పి. రూ. 2-00.

**డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904)**
మలకపేట బిల్డింగ్, ఆజంపూరా మార్కెట్‌వద్ద,
హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

ఇంటిల్లిపాదికీ ఆనందం చేకూర్చే
**ఆంధ్రసచిత్రవారపత్రిక**
తప్పక చదవండి!

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వేళ్లు పాతుకుపోయి పాదము: నేలపై బెట్టలేక రాళ్ళు తగిలిన త్రుళ్లిపడు వారు పై పూతగా వాడిన వేళ తోసహా మాయంచేయు గల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4-25న.పై.

కొక్కోకము చిత్రపటములు: గలది. రు. 1-50
దాంపత్య రహస్యములు ... రు. 3-00
తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4-50
పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

**ప్రభ అండ్ కో.**
**3, మలయపెరుమాళ్ వీధి. మద్రాసు-1.**

## నాణ్యత మరియు పొదుపు
## కుటుంబం అంతటికి

ఎంతో పొదుపు. ఎంతో ఉల్లాసకరం! ఈ పెద్ద సైజు టాల్కు ప్రఖ్యాత కాల్గేట్ శ్రేష్ఠత కలిగివుంది.

ఎంతో సువాసన! ఎంతో కాలం వస్తుంది! స్నానం చేసాక—బయటకు వెళ్లే ముందు హాయిగా ఈ పౌడరు యథేచ్ఛగా చల్లుకొన వచ్చు.

ఎంతో సుకుమారమైనది! ఎంతో మెత్తనిది! కాల్గేట్ బహుళ విధోపయోగ టాల్కును బేబి ఎంతో ప్రేమిస్తుంది. సున్నిత చర్మాలకు తగినది.

COLGATE
All Purpose
TALCUM POWDER

# కాల్గేట్
బహుళ విధోపయోగ **టాల్క్**
అపురూపమైన పువ్వుల శాశ్వత సువాసనగలది!

CAPT.6.3 TEL.

## 15 రోజులకు మాత్రము



మేలురకం అందమైన శాలువల క్లియరెన్సులమ్మకం. ఒక శాలువధర రు.7 రెండు శాలువలు ధర రు. 13/-. మూడుశాలవలు రు. 18/-. ప్రతి శాలువతో ఒక జత ఇయర్ టాప్స్ ఉచితముగా పంపబడును. కొద్ది స్టాకుగలదు. వెంటనేవీలార్డరుపంపండి.

PARIS COMMERCIAL CO,
(WAM)P.B No.1804, DELHI-6

## పాకెట్ ప్రెస్



పేర్లు, చిరునామాలు, ఉత్తరాలు, లేబెల్సువగైరాలను ... ఇంట్లో ... చక్కగా ముద్రించుకొనవచ్చును. నెం 1 రు. 2-50. నెం. 2 రు. 3-50 లు. స్పెషల్ రు. 5-50 లు. అత్యుత్తమమైనది రు. 7-50 లు. పోస్టేజి రు. 1-75.

**AMERICAN STORE (P.1)**
**265/12/1/C,**
**Gopal Lal Thakur Road, Calcutta-36.**

## అవీ - ఇవీ - అన్నీ

ఆధారంగా తీస్తున్నారు. ఇప్పటికి 6 రీళ్లకు పైగా చిత్రం పూర్తి అయింది. ఈ నెలలో మరో రెండు షెడ్యూల్సున్నవి. వాటితో చిత్రం చాలవరకు పూర్తి అయినట్టే.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, కృష్ణకుమారి, జగ్గయ్య, వాసంతి, రేలంగి, గిరిజ, రమణారెడ్డి, శాంతకుమారి, మిక్కిలినేని మొదలగువారున్నారు.

మాటలు : ముళ్లపూడి వెంకటరమణ, సంగీతం: ఘంటసాల : పాటలు : నార్ల చిరంజీవి, ఆరుద్ర, ఆత్రేయ, ఛాయ : సి. నాగేశ్వరరావు, నృత్యం : వసుమర్తి, కళ : కృష్ణారావు, కూర్పు : ప్రకాశ్, నిర్మాతలు : సుందరలాల్ నహతా అండ్ డూండీ.

ఈ చిత్రాన్ని సంక్రాంతికి విడుదల చేయమన్నారు.

సి. ధర్మారావు.★

## సి. ఎస్. ఆర్. ఆంజనేయులుమృతి

సుప్రసిద్ధ చలన చిత్ర నటులు శ్రీ సి. ఎస్. ఆర్. ఆంజనేయులు ఈ నెల 8 - వ తేదిన ఉదయం గం. 11-30 ని. లకు చనిపోయారు. రెండు రోజులుగా వారు స్మారకం తప్పివున్నారు. 8వ తేదీ ఉదయం కొద్దిసేపు మాట్లాడారు. కాని ఇంతలో పరిస్థితి ప్రమాదించి మరణించారు.

ప్రథమంలో నాటకాలలో అనేక పాత్రలు ధరించారు. చలన చిత్రరంగంలో శ్రీ సి. ఎస్. ఆర్. ఆంజనేయులు సుమారు పాతికేళ్ళుగా వుంటున్నారు. సినిమాల్లోను, రంగస్థలం మీదాకూడా వీరు అనేకపాత్రలు ధరించి ఖ్యాతి నార్జించారు. కృష్ణుడి పాత్ర, కథానాయకుని పాత్ర, ఆ పిదప హాస్య పాత్రలు ధరిస్తూ వచ్చారు. చమత్కారం, ఛలోక్తులు విసరడం, వీరి ప్రత్యేకత. వీరి నటనా నైపుణి, బహుముఖ ప్రతిభా విశేషాలు ఆంధ్ర ప్రేక్షకులకు తెలిసినవే. వీరి స్వస్థలం గుంటూరు జిల్లా నిడుబ్రోలు. ప్రస్తుతం పీటలమీద పెళ్ళి, రామదాసు, బొబ్బిలి యుద్ధం మొదలగు సుమారు 10 చిత్రాలలో నటిస్తున్నారు. ఇంతలో ఈ విషాద మరణం సంభవించింది. వీరి వయస్సు సుమారు 56 సంవత్సరాలు. భార్య, ముగ్గురు కుమార్తెలు, కుమారుడు, వున్నారు.



'గురువును మించిన శిష్యుడు'లో రాజశ్రీ



'పెంచిన ప్రేమ'లో జానకి



నటి సుజాత

పేరుపొందిన నటీనటులతో తెరకు నిండైన
కొత్త నటీనటులు పాల్గొన్న మహత్తర
పౌరాణిక చిత్రం



రాజ్యం పిక్చర్స్ వారి...

# నర్తనశాల

(విరాట పర్వము)

ప్రొడ్యూసర్: శ్రీధరరావు..రాజ్యం • డైరెక్షన్: కె. కామేశ్వరరావు

Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street
Madras-1. Chief Editor S. Sambhu Prasad.

